# రాధాకృష్ణ రచనావళి

తెలుగు :

తెనుగు విందు
వ్యాసమంజూష
మదరాసు తెలుగు
దళవాయి రామప్పయ్య
జయించిన జనత
వేమన సూక్తులు
సి. పి. బ్రౌన్ సాహితీ సేవ
ఆడపిల్ల తండ్రిని
శ్రీ విజయం
రాజభక్తి
చరిత్ర కెక్కిన చరితార్థులు
చందమామ
వాన కురిసింది
అనగనగా
మణి మంజీరము
తమిళ వేదము
తమిళ పంచకావ్య కథలు
తమిళ సాహిత్య చరిత్ర
తరతరాల తమిళ కవిత
సుబ్రహ్మణ్యభారతి
తెలుగు—దాక్షిణాత్య సాహిత్యాలు
ఆధునిక తమిళ సాహిత్య నిర్మాతలు

తెలుగుసేతలు :

ఆత్మచింతనము
తమిళ కథానికలు
చిట్టికి చిరుగంట
రంగురంగులపూలు
పగటి కలలు
దారి చూపిన తాత: గాంధీ
కడుపులో గారడీ
మా తాతయ్యకొక యేనుగుండేది
మొ॥ వి

తమిళం :

అయిరం తలైనాగం
తిరుప్పతి వేంకటేశ్వరర్

ఆంగ్లం :

The Ramayana in Telugu and Tamil-A Study
Landmarks in Telugu Literature
Tales From Telugu
Ramblings in Telugu Literature

# MADHURA NAAYAKA RAAJULU

By

Dr. Challa Radhakrishna Sarma,

M.A., M.Litt., Ph.D.

First Edition, 1978


9, Nagarjuna Nagar
Kodambakkam, Madras-600 024

*Printed at*

Weldun Press
68, Mannappa Mudali St,
Madras-21

**Price**

**Rs. 5-00**

# సమర్పణ

రాజుల కోసము
రణభూములలో
కత్తుల కెరయై
నెత్తుటి మడుగుల
అసువులు వీడిన
వీరవరేణ్యులకు

# మనవి మాటలు

తెలుగువారి చరిత్రలోనేకాక దక్షిణ భారతదేశ చరిత్రలోను క్రీ.శ. 15, 16, 17 శతాబ్దులలో మధుర (పాండ్యమండలము) నేలిన నాయకరాజుల చరిత్ర ఒక మధురాధ్యాయము! బలసంపన్నులు, "మేరు సమాన ధైర్యయశస్తిలకులు" నైన ఆ తెలుగు దొరల యేలుబడి లోనే దక్షిణ భారతమున తెలుగు మాటకు ఒక క్రొత్త చెలువము లభించినది; తెలుగు పాటకు ఒక క్రొత్త సోయగము సిద్ధించినది. వారు సాగించిన సమరములును, సాధించిన విజయములును సంస్మర ణీయములు. ఆ జైత్రయాత్రలు సంస్కృతీ విజయగాథ లన్నను అతిశ యోక్తి కానేరదు. శిల్ప చిత్రలేఖనాది లలితకళలకు పాదులు వెట్టి, నీరు పోసి పోషించిన కళారాధకులు వారు; మతసహిష్ణుత ప్రదర్శించిన విశాల హృదయులు. ప్రజల కోసము సత్రములు, చావడులు, బావులు, చెరువులు మున్నగునవి నిర్మించి మహిత యశస్సు సముపార్జించిన మహనీయులు వారు.

మధుర నాయక రాజులను గూర్చి ఆంగ్లములో వెలువడిన శ్రీ ఆర్. సత్యనాథయ్యరు ప్రభృతుల రచనలు, తెలుగు తమిళముల లోని చారిత్రక లేఖనములు మొదలగునవి ఈ రచనకు ఆధారములు. ఆయా గ్రంథకర్తలకు నేను మిక్కిలి కృతజ్ఞుడను.

ఈ పుస్తకము వెలుగు చూచుటకు ముఖ్యకారణము ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వమువారి ఆర్థిక సహాయము. వారికి నా కృతజ్ఞతను వినయపూర్వకముగా తెలుపుకొనుచున్నాను.

ముఖపత్ర చిత్రమును గురించి రెండు మాటలు. రాణి మంగమ్మయు, ఆమె మనుమడు విజయరంగ చొక్కనాథ నాయకుడును గల యీ చిత్రము మధుర మీనాక్షి ఆలయములోని ఊంజల్ (ఊయెల) మండపము నందలి భిత్తి చిత్రము. దీనిని దయతో ఒసగిన తమిళనాడు ప్రభుత్వ పురాతత్వశాఖ వారికి మిక్కిలి కృతజ్ఞుడను. తెలుగువారి ప్రతిభాదికమును తెలియజేయుచున్న యీ రచన తెలుగు పాఠకలోకమును అలరించునని నా నమ్మకము.

—చల్లా రాధాకృష్ణశర్మ

# విషయానుక్రమణిక

# 1

# మధురనాయక రాజ్యస్థాపనము

చరిత్రకు తెలియవచ్చిన నాటినుండియు వైగై నదీతీరమున ఉన్న మధురానగరము సిరిసంపదలకు కొటారమై, తమిళభాషా సాహిత్యములకు నిలయమై శోభిల్లెను. ఆ నగరరాజము తొలుత పాండ్యభూపతుల అధీనములో ఉండెను. అందువలన మధురరాజ్యమునకు పాండ్యమండల మను వ్యవహార నామము కలిగెను. పాండ్యులు బలహీనులు కాగా, వారిని జయించి చోళులు మధురను వశము చేసికొనిరి. గంగైకొండచోళ బిరుదవిరాజితుడైన రాజేంద్ర చోళుడే మధురను పరిపాలించిన ప్రథమ చోళమహీపతి అని చరిత్రకారుల నమ్మకము. అటుపిమ్మట వారికి పాండ్యులు సామంతులై కాలము గడపసాగిరి. 13 వ శతాబ్ది నాటికి చోళరాజుల ప్రాభవ ప్రాబల్యములు తగ్గుముఖము పట్టెను. తగిన తరుణమునకై వేచియున్న పాండ్యులు ఆ అవకాశమును పురస్కరించుకొని మధురను హస్తగతము చేసికొన ప్రయత్నించిరి. కాని లాభము లేకపోయెను.

ఇది యిట్లుండగా, 1310లో ఢిల్లీపాదుషా అయిన అల్లాఉద్దీనుచే అనుజ్ఞాతుడై అతని సేనాధిపతి మలిక్ కాఫర్ దక్షిణాపథము మీదికి దండెత్తివచ్చి విజయపరంపర సాధించెను. పాండ్యమండలము కూడ అతని స్వాధీనమయ్యెను.

మలిక్ కాఫర్ జైత్రయాత్రాఫలితముగా దక్షిణ భారతము లోను చంద్రధ్వజము రెపరెపలాడదొడగెను. అయినను, 1336 వ సంవత్సరమున విద్యారణ్య స్వామివారి సహకార సానుభూతులు సంప్రాప్తములు కాగా, హరిహర బుక్కసోదరులు తుంగభద్రా నదీతీర మున విజయనగరమును స్థాపించి హిందూ మతమునకును తత్ సంస్కృతికిని జీవము పోసిరి. హరిహరరాయల మరణానంతరము మొదటి బుక్కదేవరాయలు సింహాసనమునకు వచ్చెను. అతని కుమారుడైన కంపరాయలు మహాసాహసుడగు యుద్ధవీరుడు. అతని నాయకత్వమున విజయనగర సైన్యములు మధురను ముట్టడించి, తన్నగరమును పాలించు సుల్తానును సంహరించి మధురను వశము చేసికొనెను.[2] ఈ విజయగాథ అతని భార్య గంగాదేవి వ్రాసిన మధురావిజయ మను ప్రశస్త సంస్కృత కావ్యములో మనోహరముగా అభివర్ణితము.[3]

వీరకంపరాయల విజయమునకుఫలితముగా మధురరాజ్యము విజయనగర రాజ్యమున లీన మయ్యెను. తదాదిగా విజయనగరా ధీశ్వరుల ప్రతినిధులు పాండ్యమండల వ్యవహారములను పర్యవేక్షింప జొచ్చిరి. వారిని దక్షిణ మహామండలేశ్వరు లనుట వ్యవహారము ఈ రాజప్రతినిధి నియామకము 1370 కి పిమ్మట జరిగె ననియు, వీర కంపరాయలే మొదటి ప్రతినిధి అనియు భావింపబడు చున్నది.

రాజప్రతినిధి నియామకము జరిగినను, ప్రాచీన పాండ్య భూపతుల సంతతివారే మధురను పరిపాలించుచుండిరి. కనుక వారిని పర్యవేక్షించుటయే రాజప్రతినిధి కర్తవ్యమై ఉండెను. బుక్కదేవ రాయల మరణా నంతరము రెండవ దేవరాయలు రాజ్యమునకు వచ్చెను. అతని కాలములో లక్కన మాదన లను సోదరులు రాజ ప్రతినిధులుగా నియమితులై మధుర, తంజావూరు రాజ్యముల వ్యవహా

రములు పర్యవేక్షించు చుండిరి. అటు పిమ్మట సాళువ వంశీయుడైన నరసింహరాయలును, అతని అనంతరము తుళువ వంశస్థుడైన నరసింహరాయలును విజయనగర సామ్రాజ్యమును పరిపాలించిరి. తుళువ వంశీయులలోనే కాక దక్షిణ భారతము నేలిన చక్రవర్తులలోనే ప్రముఖు డనదగిన శ్రీకృష్ణదేవరాయల కాలములో దక్షిణాపథము విజయనగరాధీశ్వరుల యేలుబడిలోకి వచ్చెను.

రాయలవారి కాలములో పాండ్య మండలమున చంద్రశేఖర పాండ్యుడును, చోళమండలమున వీరశేఖర చోళుడును రాజ్యాధికారము చేయు చుండిరి. చంద్రశేఖర పాండ్యుడు బలహీను డగుటచే మధురలో శాంతి భద్రతలు స్వప్నగత వృత్తాంతము లయ్యెను. శక్తిమంతమగు ప్రభుత్వము కూడ లోపించెను. పాండ్యుడు దాసీపుత్రుడను అపప్రథ ఒకటి ప్రచారములో ఉండెను. అందువలన ప్రజలు, సామంతులును అతని పరిపాలనమును నిరసించిరట! ఈ కారణములను ఆధారము చేసికొని వీరశేఖర చోళుడు అనాయాసముగా చంద్రశేఖర పాండ్యుని యుద్ధములో జయించి మధురను వశము చేసికొనెను. పిమ్మట రాజ్యభ్రష్టుడైన పాండ్యుడు వీరశేఖరచోళుని విజయ వృత్తాంతమును రాయలవారికి నివేదించెననియు, అది విని కోపోద్రిక్తుడైన రాయలు వీరశేఖరచోళుని శిక్షింప దలచి, ఆ కార్యభారమును దక్షిణ దేశపు ప్రతినిధి అయిన కోట్యము నాగమనాయని యందుంచెననియు తెలియుచున్నది.[4]

నాగమనాయకుడు కాశ్యపగోత్రోద్భవుడు. కాంచీపుర నివాసి. రాయలకు కుడిభుజము. సేనాధిపతి, కోశాధికారి, ముఖ్య కరగ్రాహిమున్నగు బాధ్యతాయుతములగు పెక్కు పదవులను కడు సమర్థతతో నిర్వహించిన ప్రతిభాశాలి. సాళువ నరస నాయకుడు మరణించిన పిదప తుళువ నరసనాయకుడు విజయనగర సింహాసనమును ఆక్ర

మించుటకు ప్రయత్నించిన సందర్భమున నాగమనాయకు డతనికి చేదోడు వాదోడుగా సంచరించిన కారణమున, అతడు తుళువ వంశీయుల ఆదరాభిమానములకు పాత్రు డయ్యెను. అటుల రాజానుగ్రహమును సంపాదించి సిరిసంపదలతో తులదూగుచున్నను, అనపత్యుడైన కారణమున నాగమనాయకుడు సంతానార్థియై కాశికా విశ్వేశ్వరుని సందర్శింప దలచెను. అప్పుడు తన ముఖ్యాశ్రితుడగు రామభద్రప్ప నాయని తన స్థానమునం దుంచి నాగమనాయకుడు కాశికి పోయెను. విశ్వనాథుని సేవించి స్వగృహము చేరిన కొంతకాలమునకు నాగమనాయనికి పుత్రోదయ మయ్యెను. అతడే విశ్వనాథ నాయకుడు.[5]

రాయల వారి ఆజ్ఞ ననుసరించి చోళ మండలమునకు వెడలిన నాగమనాయడు వీరశేఖర చోళుని జయించి పిమ్మట మధురకు పయన మయ్యెను. అట ప్రశాంతత లోపించియుండెను. కనుక శాంతిభద్రతలు నెలకొల్పవలెనను సదుద్దేశముతో మధురను పాండ్యుని వశము చేయక నాగమనాయడే స్వయముగా పాండ్య చోళ మండలముల పరిపాలనా వ్యవహారములను పర్యవేక్షింప సాగెను. ఇది పాండ్యునికి నచ్చలేదు. నా రాజ్యమును నా వశము చేయు మనుచు అతడు ప్రక్కలోని బల్లెము వలె నాగమనాయని బాధింప జొచ్చెను. అయినను పాండ్యుని మాటలను పెడచెవిని పెట్టి నాగమనాయకుడే రాజ్యాధికారము చేయు చుండెను. అప్పుడు గత్యంతరము లేక పాండ్యుడు రాయలవారిని దర్శించి మధుర రాజ్య వ్యవహారములను వివరించెను.

అంతలో నాగమనాయడు కూడ మధురలోని అప్రశాంత వాతావరణమును వివరించుచు ఒక లేఖ వ్రాసి దానిని రామభద్రప్ప నాయని మూలముగా రాయలకు అందజేసెను. కాని తన ఆజ్ఞను ఉల్లంఘించె నను కోపముతో రాయలు రామభద్రప్ప నాయని మాట

లను సరకుసేయలేదు. అంతేకాదు; మధురను పాండ్యుని వశముచేసి విజయనగరమునకు మరలి రమ్మని ఆజ్ఞాపించుచు నాగమనాయనికి ఒక లేఖ పంపెను. అందుకు ప్రత్యుత్తర మొసగుచు తాను తన నిజ ద్రవ్యమును కూడ వినియోగించి మధురలో శాంతిభద్రతలు నెలకొల్పు చుంటి ననియు, దాసీపుత్రుడు, అసమర్థుడును అయిన చంద్రశేఖర పాండ్యుడు రాజ్యము చేయుటకు అనర్హు డనియు నాగమనాయడు విజయనగర సామ్రాట్టునకు తెలియజేసెను. కాని ఆ సమాధానము రాయలను కోపవివశునిగా చేసెను. పిమ్మట రాయలచే అనుజ్ఞాతుడై విశ్వనాథనాయకుడు తండ్రిపై కత్తికట్టుటకే నిశ్చయించి మధురకు ససైన్యముగా వెడలె ననియు, తండ్రి కొడుకులకు ఘోర యుద్ధము జరిగెననియు, అంతలో విశ్వనాథనాయకుడే జయించెననియు, పిమ్మట అతడు దక్షిణ సింహాసనాధ్యక్షుడయ్యె ననియు తెలియు చున్నది. ఈ విషయాదికము తంజావూరి ఆంధ్రరాజుల చరిత్రలో వివరముగా పేర్కొనబడినది. నాగమనాయని తిరుగుబాటును సమర్థించు శాసనా ధారము లభించకపోయినను, పై చారిత్రక లేఖనము నందలి కథన మును బట్టి చూడగా అందలి విషయములు కొంతవర కైనను విశ్వస నీయము లని తోచును.

ఏది ఎట్లున్నను, మధురనాయక రాజ్యస్థాపనము శ్రీకృష్ణదేవ రాయల కాలములో జరిగెనని తలచుటకు ఈ కథ మిక్కిలి తోడ్పడు చున్నది. అనగా రాయల వారి మరణాత్పూర్వమే, 1529 వ సంవత్స రములో మధురలో నాయకవంశీయుల పరిపాలన ప్రారంభ మయ్యె నని చెప్పవచ్చును.[6]

మధుర నాయక రాజ్య స్థాపనము శ్రీకృష్ణదేవరాయల కాల మున గాక అచ్యుతదేవరాయల కాలమున జరిగె ననియు, విశ్వనాథ నాయకుడు మధుర నాయక రాజ్య స్థాపకుడు కాడనియు కొందరు

చరిత్రకారుల అభిప్రాయము.[7] కాగా అచ్యుత దేవరాయల కాలములో కూడ విశ్వనాథనాయకుని కుమారుడగు మొదటి కృష్ణప్పనాయకుని కాలములో మధుర నాయక రాజ్యస్థాపనము జరిగెననియు పేర్కొనదగును.

అచ్యుత దేవరాయలచే పలువగ బిరుదులు పొంది విశ్వనాథ నాయకుడు దక్షిణ సింహాసనాధ్యక్షుడయ్యె నని పాండ్యరాజ చరిత్ర అను ప్రాచీన లేఖనము పేర్కొనుచున్నది.[8] తంజావూరి ఆంధ్ర రాజుల చరిత్ర కూడ పాండ్య మండలాధీశ్వరుడుగా విశ్వనాథ నాయకుడు మధురకు వెడలినపుడు, శ్రీకృష్ణదేవరాయలు అతనిని ఘనముగా సన్మానించెననియు, విజయనగరాధి దేవత అయిన దుర్గాదేవి విగ్రహమును కూడ అతనికి బహూకరించెననియు పేర్కొనుచున్నది.[9]

మధురనాయక రాజ్యస్థాపనము 1529 వ సంవత్సరమున జరిగెనని సత్యనాథ అయ్యరును, అచ్యుత దేవరాయల కాలమున జరిగెనని హెరాస్ దొరయు పేర్కొనిరి. ఈ రెండు వాదములే కాక మరొక వాదము కూడ కలదు. అచ్యుత దేవరాయలకు పిమ్మట సింహాసనమునకు వచ్చిన సదాశివరాయల కాలములో నాయకరాజులు స్వతంత్రులై రాజ్యాధికారము నెరపుచుండిరని ఈ వాద సారాంశము. ఇట్లు విశ్వసించు చరిత్రకారుల మతానుసారము మధుర నాయకరాజుల పరిపాలన 1559 వ సంవత్సరము నుండి ప్రారంభ మగుచున్నది.[10] 1560 వ సంవత్సరమున వేయబడిన విశ్వనాథ నాయకుని శాసనమునకును, అంతకు పూర్వము వేయబడిన అతని శాసనములకును గల భేదమే పై వాదములను బలపరుచుచున్నది.

విశ్వనాథ నాయకుని తొలి శాసనములలో అతడు 'భృత్యుడు', 'ఊడిగము', 'అడపము' అని పేర్కొనబడెను. కాని 1560 వ సంవత్సరపు శాసనమునందు అతని కుమారుడైన మొదటి కృష్ణప్ప నాయ

కుడు కూడ అతనికి ప్రభుత్వ వ్యవహారములలో సహాయము చేయు చున్నట్లుగా కలదు. కనుక మధురనాయక రాజ్య స్థాపనము 1559 వ సంవత్సరమున జరిగెనని భావించుటయే యుక్తము. మధురకు సంబంధించిన పెక్కు చారిత్రక లేఖనములు విశ్వనాథ నాయకుడే మధుర నాయక రాజ్యస్థాపకుడని పేర్కొనుట గమనింపదగిన విషయము.

---

1. వైయై అని కూడ వ్యవహరింతురు.

2. కంపరాయలకు సహాయముగా గోపన మంత్రి, సాళ్వ మంగు (మంగనృపుడు) మొదలగువారు సుల్తానుతో జరిగిన యుద్ధములో పాల్గొనిరి. ఈ యుద్ధము 1365-70 ప్రాంతముల జరిగినట్లు భావింపబడుచున్నది.

గోపన మంత్రి ఆనాళ్లలో అశేషశేముషిని ప్రదర్శించిన మంత్రి సత్తముడు. సింధుమతీపరిణయ మను ప్రబంధము అతని రచన.

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు వెలయించిన జైమిని భారతములో సాళ్వమంగనృపుని ప్రశంస కలదు.

"దురములో దక్షిణ సురతాను నెదిరించి
కొనివచ్చి సంపరాయనికి నిచ్చె
సామ్రాజ్యమున నిల్పి సాంపరాయ స్థాప
నాచార్య బిరుద విఖ్యాతి గాంచె
శ్రీరంగవిభు ప్రతిష్ఠించి యఱువదివేల
మాడ లద్దేవునమ్మదికి నొసగె

మధుర సురత్రాణు మడియించి పరపక్షి
సాళువ బిరుదంబు జగతి నెఱపె

.... .... .... .... ....

సాహసంబున నుపొ్పంగు సాళ్వమంగు."

3. 9 సర్గల ఈ కావ్యమునకు వీరకంపరాయ చరిత మను నామాంతరము కలదు. దీనిని శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి పద్యకావ్యముగ తెలుగు చేసిరి.

1966 లో శ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి సవ్యాఖ్యానముగా ప్రకటించిరి.

4. ఈ వృత్తాంతము తంజావూరి యాంధ్రరాజుల చరిత్రలో విపులముగా చెప్పబడినది. రెండవ వేంకటపతిరాయలు వేయించిన కూనియూరు పత్రము లందును ఈ ప్రశంస చేయబడినది. (చూడుడు : శ్రీ హెచ్. కృష్ణశాస్త్రి వ్యాసము, ఎపిగ్రాఫియా ఇండికా, సం. 3, పు. 236)

5. లింగనమఖి శ్రీ కామేశ్వరకవి రచించిన సత్యభామా సాంత్వనములో ఇట్లు కలదు.

" ఆ నాగవిభుండు గంగా
స్నానము గావించి విశ్వనాథుని కృప యెం
తేని తగ విశ్వనాథ
క్ష్మానాథుని గాంచె వేడుకలు నలువొందన్ "

విశ్వనాథనాయకుడు 1495 లో జన్మించినట్లు భావింపబడు చున్నది.

6. శ్రీ ఆర్. సత్యనాథ అయ్యరు: History of the Nayaks of Madura, పు. 47.

7. శ్రీయుతులు కె. ఏ. నీలకంఠశాస్త్రి, నేలటూరు వేంకట రమణయ్యలు తమ Further Sources of Vijayanagara History లో (సం. 1, పు. 241) ఇట్లు పేర్కొనిరి.

"A careful and unbiassed study of all the available sources of information leads us to the conclusion that the Nayak Kingdom of Madura was founded not by Viswanatha Nayaka but his son Krsnappa."

...

8. "అచ్యుతరాయ లే యవనీశ మౌళికి
నరుదులౌ పలువగ బిరుదు లిచ్చె
దక్షిణ సింహాసనా క్షీణ సామ్రాజ్య
ధౌరేయు డయ్యె నేధరణి విభుడు
ఘనముగా విజయదుర్గను మహాలక్ష్మి నే
ధీరుడు తెచ్చి ప్రతిష జేసె
మధురాపురంబున, మహనీయ పాండ్య భూ
మండలం బేలె నే మహిపమౌళి
యతడు నృపమాత్రుడా! మహాహవజయాంక
భూవరాహాది బిరుద సంభూత కీర్తి

కా_ర్తికీ చంద్ర ధవళిత గగనవాటి
నలఘుడౌ విశ్వనాథనాయక కిరీటి."

ఈ పద్యమును తొలుత కీ_ర్తిశేషులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి సత్యభామాసాంత్వన పీఠికలో ప్రకటించినారు.

9. తంజావూరి ఆంధ్రరాజుల చరిత్రపు ప్రత్యంతరము నందు వీరశేఖర చోళుని శిక్షించుటకు నాగమనాయని దక్షిణా పథమునకు పంపినవాడును, విశ్వనాథనాయకుని దక్షిణ సింహాసనా ధ్యక్షునిగా చేసినవాడును శ్రీ కృష్ణదేవరాయలు కాదనియు అచ్యుతదేవరాయలే అనియు కలదట! కర్ణాటకొటికం రాజుల కై_ఫీయతులలో కూడ ఈ విషయ ముదాహరింపబడెనట. వివర ములకు : Further Sources of Vijayanagara History, పు. 225-27

10. శ్రీయుతులు నెల్సన్, వి. రంగాచారి, కె. ఏ. నీల కంఠశాస్త్రి, నేలటూరు వేంకటరమణయ్య, మల్లంపల్లి సోమశేఖర శర్మ ప్రభృతు లీవాదమును బలపరుచుచున్నారు. డాక్టర్ నేలటూరు వేంకటరమణయ్య ఈ అభిప్రాయమునే తమ Studies in the History of 3rd Dynasty of Vijayanagara లో (పు. 457) పునరుద్ఘాటించినారు.

# 2

# విశ్వనాథ నాయకుడు

## [1529 - 1564]

విజయనగరమునుండి తరలివచ్చిన విశ్వనాథ నాయకుడు[1] మధురలో ప్రవేశించునాటికి ఆ నగరము పూజాపురస్కారములు లేక బూజుపట్టిన గుడి వలె ఉండెను. మధుర రాజ్యములో ఎచ్చట చూచినను చిట్టడవులే కానవచ్చెను. చోరభయము ఎక్కువగా ఉండెను. దుర్గములు శిథిలావస్థలో ఉండెను. గుళ్ళు గోపురములు కళా విహీనములై ఉండెను. శాంతిభద్రతలు కరవయ్యెను. తుదకు మధురానగరము కూడ దుస్థితికి పాల్పడియుండెను. కాగా మధురను తొలుదొలుత పునరుద్ధరింప దలచి, విశ్వనాథ నాయకుడు దళవాయి ప్రధాని[2] అరియనాథ మొదలి, దళవాయి విసపాకం కేశవప్పనాయడు మొదలగు వారితో సంప్రదించి, తన్నగరమును పునర్నిర్మించెను. అది ముగిసిన పిమ్మట మీనాక్షీ సుందరేశ్వరుల ఆలయమును కన్నుల పండువుగా తీర్చి దిద్దెను. ప్రజలకు ఉపకరించు పనిపాటులలో పిత్రార్జితమైన ధనమును కూడ వినియోగించుటకు అతడు వెనుదీయలేదు. అట్టి త్యాగవీరుడు విశ్వనాథ నాయకుడు! కనుకనే దానశీలుడనియు, ప్రజారంజక పరిపాలకుడనియు అతడు పేరుప్రఖ్యాతులు గడించెను.

అతని యేలుబడిలో మధుర సర్వ విధముల అభివృద్ధి చెందెననుట నిస్సంశయము.

విశ్వనాథ నాయకుడు తొలుత పాండ్య చోళ మండలములకు రాజప్రతినిధిగా నియమింపబడెను. కాని శ్రీకృష్ణదేవరాయల మరణానంతరము, అచ్యుత దేవరాయల కాలములో చోళమండలము ప్రత్యేక రాజ్యముగా పరిగణింపబడెను. దానికి చెవ్వప్ప నాయకుడు అనునతడు పరిపాలకు డయ్యెను. అతడు అచ్యుత దేవరాయలవారి మరదలగు మూర్తెమ్మను వివాహ మాడెను. ఆ సందర్భమున, చెవ్వప్ప నాయకునికి తంజావూరి రాజ్యము అరణముగా లభించినట్లు విశద మగుచున్నది.

ఈ విభజనానంతరము, తిరుచ్చిరాపల్లి మధురకును, వల్లం దుర్గము తంజావూరికిని సంక్రమించెను. ఆ నాళ్ళలో కావేరి కిరువైపుల చిట్టడవులు దట్టముగా పెరిగిన కారణముగా, దొంగల భయము ఎక్కువగా ఉండెను. అందువలన విశ్వనాథ నాయకుడు ఆ అడవులను కొట్టించెను. రక్షకభట దళమును ఏర్పరిచెను. తిరుచ్చిరాపల్లి దుర్గము నావరించి రెండు ప్రాకారములు నిర్మించి, వాటి చుట్టును విశాలమగు కందకమును త్రవ్వించెను. తత్ఫలితముగా తిరుచ్చిరాపల్లికి రక్షణ యేర్పడెను; చోరభయము నశించెను. అంతటితో ఆగలేదు విశ్వనాథ నాయకుడు: తిరుచ్చిరాపల్లి, శ్రీరంగము మొదలయిన పుణ్యక్షేత్రములందలి ఆలయములను పునరుద్ధరించెను.

విశ్వనాథ నాయకుని కాలములో తిరుచ్చిరాపల్లిలో సుందరమగు తటాక మొకటి వెలసెను. దీనిని తెప్పకుళం అని వ్యవహరింతురు. శ్రీరంగ దేవాలయమునందు క్రొత్తగా మందిరము లనేకములు కట్టించెను. ప్రాకారముల లోపల నివాసయోగ్యములగు గృహములు కూడ కట్టించెను. ఒక్క శ్రీరంగదేవాలయమునకే విశ్వనాథ నాయ

కుడు మూడు లక్షల పొన్నుల ధనమును (బంగారు నాణెములు) వెచ్చించినట్లు విదిత మగుచున్నది.

అటుల విశ్వనాథ నాయకుడు మధురను పునర్నిర్మించియు, జీర్ణావస్థలో ఉన్న గుళ్లుగోపురములను పునరుద్ధరించియు ప్రజాసన్నుతిని చూరగొనుచుండగా, తిరునెల్వేలి మండలములో ఒక తిరుగుబాటు తల యెత్తెను.

ప్రాచీన పాండ్యరాజుల సంతతికి చెందిన ఐదుగురు రాజులు ఏకమై విశ్వనాథ నాయకుని ప్రతిఘటింప నిశ్చయించిరి. వారిని పంచపాండ్యు లందురు. ఆ తిరుగుబాటును అణచుటకై విశ్వనాథ నాయకుడు అరియనాథ మొదలిని తిరునల్వేలికి పంపించెను. నయోక్తులతో అతడు వారిని వశము చేసికొనుటకు యత్నించెను. కాని లాభము లేకపోవటచే, తుదకు యుద్ధమే శరణ్య మయ్యెను. ఆ సందర్భమున తిరువడి రాజ్యము నేలు భూతలవర్మ అను నతడు పంచపాండ్యులకు అండగా నిలిచెను. అందువలన విశ్వనాథ నాయకుడు తిరువడి మీదికి కూడ దండెత్తి పోవలసివచ్చెను. ఏక కాలమున రెండు యుద్ధములలో పాల్గొనవలసి వచ్చుటచే, విశ్వనాథ నాయకుడు దక్షిణభారత వ్యవహారములను అచ్యుత దేవరాయలకు తెలియజేసి, అతని సహాయము నర్థించెను.

అచ్యుత దేవరాయలు వెనువెంటనే సైన్యసమేతుడై కదలివచ్చి తిరువడి రాజ్యమును ముట్టడించెను. ఈ యుద్ధములో మొదటి కృష్ణప్ప నాయకుడు ప్రముఖ పాత్ర వహించెనని తెలియుచున్నది. విజయనగరాధీశ్వరునితో యుద్ధము చేయజాలక భూతల రామవర్మ సుచీంద్రమనుచోట సమ్రాట్టుతో సంధి చేసికొనెను. అతనికి కప్పము కట్టుటకు కూడ సమ్మతించెను.

అటుపిమ్మట విశ్వనాథ నాయకుడు పంచపాండ్యులతో యుద్ధమునకు దిగెను. అతడు ప్రదర్శించిన ధైర్య సాహసములకు అచ్చెరువొంది అతనితో వారు సంధి చేసికొనిరి. తత్ఫలితముగా తిరునల్వేలి మండలము మధురకు సంక్రమించెను.

శాంతిభద్రతలు నెలకొల్పుటయే లక్ష్యముగా భావించిన విశ్వనాథ నాయకుడు వెనువెంటనే తిరునల్వేలి పట్టణమును విస్తృతపరిచెను. వీధులను విశాలను చేసెను. గుళ్లుగోపురములను పునరుద్ధరించెను. క్రొత్తగా కొన్ని గ్రామములు నిర్మించెను. చెరువులు, కాలువలు మొదలగువాటిని త్రవ్వించి వ్యవసాయాభివృద్ధికి మిక్కిలి పాటుపడెను. కాగా, విశ్వనాథ నాయకుని దొరతనములోకి వచ్చిన పిమ్మట తిరునల్వేలి మండలమున శాంతిభద్రతలు నెలకొనెననుట సత్యదూరము కాదు.

అటుల విశ్వనాథ నాయకుడు రాజ్యమునందెల్లెడల శాంతిభద్రతలు కల్పించుటకు కృషి సలుపుచున్న కాలములో, అతడు మరొక యుద్ధము చేయవలసి వచ్చెను. కంబముగూడలూరుసీమ నేలు రాజు తాను చోళవంశీయుడ నని చెప్పుకొని విశ్వనాథ నాయకుని రాజ్యాధికారమును తిరస్కరించుటయే కాక, చెల్లించవలసిన కప్పమును కూడ చెల్లించుటకు నిరాకరించెను. విశ్వనాథ నాయకుని ఆజ్ఞానుసారము రామభద్రప్ప నాయడు సైన్యసమేతుడై వెడలి కంబమును ముట్టడించెను. ఆ యుద్ధములో మధురకే విజయము లభించెను. అందుకు సంతోషించి విశ్వనాథ నాయకుడు వైగై ఒడ్డున ఉన్న వేదకరై అను పాళెమును రామభద్రప్ప నాయనికి సర్వాధికారములతో ఇచ్చెను.

విశ్వనాథ నాయకుని కాలములోనే మధుర రాజ్యము మహోన్నతస్థితి నందుకొనెను. అతని రాజ్యమునకు ఉత్తరమున ఉత్రుత్తూరు వలికొండ పురములను; దక్షిణమున కన్యాకుమారియు, పడమట

కోయంబత్తూరు, ధారాపురము, ఈరోడులును; తూర్పున రామేశ్వర మును సరిహద్దులుగా ఉండెను. అనగా, నేటి మధుర, రామనాథ పురము, కోయంబత్తూరు, సేలం జిల్లాలు అతని కాలములో మధుర నాయక రాజ్యమై ఉండెనని చెప్పవచ్చును.[3] తిరువాంకూరులోని కొంత భాగము కూడ అతని యేలుబడిలోకి వచ్చినట్లు తెలియుచున్నది.

రాజ్యమున శాంతిభద్రతలు నెలకొల్పబడిన తరువాత, పరిపాలన సౌష్ఠవము నుద్దేశించి విశ్వనాథ నాయకుడు ఒక నూతన పరిపాలనా విధానమును ప్రవేశపెట్టెను. దానికి పాళెము పద్ధతి అని పేరు. ఆ విధానమునకు రూపరేఖలు తీర్చిదిద్దినవారిలో దళవాయి ప్రధాని అరియ నాథ మొదలి మొదట పేర్కొనదగినవాడు.

ప్రాచీన పాండ్యరాజుల సంతతివారును, వారి సామంతుల సంతతివారును, మహమ్మదీయుల బారినుండి తప్పించుకొను తలంపు తోనో మరి యే కారణముననో ఉత్తరము నుండి వచ్చి దక్షిణభారత మున స్థిరనివాసములు ఏర్పరుచుకొన్నవారును ఆ యా ప్రదేశము లలో పలుకుబడి కలిగియుండిరి. వారెల్లరు సంతృప్తులైననే కాని మధుర రాజ్యములో శాంతి సుస్థిరముగా ఉండదు. అంతేకాక, ఆ రోజులలో రాజ్యమున పలుచోట్ల చిట్టడవులు పెరిగియుండుటచే దేశము బీడువడి యుండెను. ఈ విషయములను క్షుణ్ణముగా గ్రహించిన విశ్వనాథనాయకుడు దేశ క్షేమమును ఉద్దేశించి పాళెము పద్ధతిని ప్రవేశపెట్టెను.

విశ్వనాథనాయకుడు రాజ్యము నంతటిని డెబ్బదిరెండు పాళె ములుగా విభజించెను.[4] ప్రతి పాళెమునకును ఒక అధికారిని నియ మించెను. అతనికి పాళెగారు అని పేరు. పాళెములకు సంబంధించిన సర్వ వ్యవహారములందును తుదిమాట ఆ యా పాళెగార్లదే శత్రువుల

వారి నుండి పాళెములను సంరక్షించుకొను బాధ్యత కూడ వారికే ఒప్పగించబడెను. వారసత్వాధికారము సైతము కల్పింపబడుటచే పాళెగార్ల సంతతికి పాళెములపై హక్కు ఏర్పడెను. కనుక ఈ విధానము వలన ఆ యా పాళెములకు పాళెగార్లు ప్రభువు లయిరి. అధికారముతో పాటు కొన్ని షరతులు కూడ విధింపబడెను. పాళెగార్లు కేంద్ర ప్రభుత్వము నెడల వినయవిధేయతలు ప్రకటింపవలెను. తమ రాబడిలో మూడవ వంతును వారు కప్పముగా చెల్లించవలెను. యుద్ధము సంభవించిన, తమ తమ సైన్యములు పంపి వారు మధుర రాజ్యాధిపతికి బాసటగా నిలువవలెను.

పాళెము పద్ధతిని ప్రవేశపెట్టుట వలన విశ్వనాథనాయకుడు రాజ్యము నందలి పేరు గల మన్నీల ఆదరాభిమానములు చూరగొనెను. ప్రాచీన పాండ్యరాజుల సంతతికి చెందినవారును, స్థానికముగా పలుకుబడి కల ప్రముఖులును విశ్వనాథనాయకుని యందు అవిరళ భక్తి విశ్వాసములు ప్రకటించిరి. అందువలన రాజ్యములో శాంతి భద్రతలు సుస్థిరము లయ్యెను. మరొక విశేష మేమనగా: పరిపాలనాధికారముతో పాటు బాధ్యతలు కూడ కల్పింపబడుటచే, పాళెగార్లు తమ పాళెములను శ్రద్ధాసక్తులతో సంరక్షించు కొనసాగిరి. ఈ విధానము అమలులోకి వచ్చిన తరువాత, చిట్టడవులు చాలవరకు నిర్మూలింపబడెను. బీడుగా పడియున్న భూమి సాగుచేయబడెను.

మొత్తముమీద పాళెము పద్ధతి విశ్వనాథనాయకుని కాలములో సత్ఫలితములు ఒసగినను, తరువాతి వారి కాలములో అది అనర్థములకు దారి తీసెనని నుడువవలసి యున్నది. కనుక ఈ విధానము విశ్వనాథనాయకుని కాలములోనే సర్వోత్కృష్టముగా ఉండె ననుట సమంజసము.

విశ్వనాథ నాయకుడు వస్తుతః బహుముఖ ప్రజ్ఞాశాలి. అయినను అతడు పరిపాలనా వ్యవహారములలో నాగమనాయని ముఖ్యాశ్రితుల సహాయమును అపేక్షించెను. వారిలో పేర్కొనదగినవారు అరియనాథ మొదలి, రామభద్రప్ప నాయడు ప్రభృతులు.

అరియనాథ మొదలి పేదకుటుంబములో జన్మించెను. స్వయం కృషివలన దళవాయిప్రధాని వంటి ఉన్నత పదవిని అలంకరించి కడు సమర్థతతో వ్యవహరించెను. విశ్వనాథ నాయకుడు తలపెట్టిన రాజకీయ సంస్కరణములలో అతడు ప్రముఖపాత్ర వహించెను. విశ్వనాథ నాయకుడును అరియనాథ మొదలియు కలసి తిరునల్వేలి సీమలో పండ్రెండు గ్రామములు దానము చేసినట్లు ఒక శాసనము స్పష్టము చేయుచున్నది.[5]

మధురలో శాంతి స్థాపనావసరమున విశ్వనాథ నాయకునికి కుడిభుజముగా వ్యవహరించినవాడు రామభద్రప్పనాయడు. చారిత్రక లేఖనములలో అతడు బహుధా ప్రశంసింపబడినాడు. కాని రామప్ప నాయకు డను పేరు శాసనములలో కనిపించుచున్నది. ఈ రామప్ప నాయకుడే రామభద్రప్ప నాయకుడు కావచ్చును. అతడు వేదకర్తె పాళెపు దొరగా ఇరువది సంవత్సరములు ఆ పాళెమును అనుభవించెను. అతని మరణవార్తను విని విశ్వనాథ నాయకుడు మిక్కిలి పరితపించెనట!

విశ్వనాథ నాయకునికి సంబంధించిన శాసనము లన్నియు అతడు చాల గొప్పవాడని పేర్కొనుచున్నవి. యుద్ధవీరుడుగా దాన కర్ణుడుగా అతడు పేరుపెంపులు గడించెను. తన తండ్రి ఆర్జించిన ద్రవ్యమును కూడ ప్రజోపయోగములగు కార్యములకు వినియోగించుటలో అతని ఔదార్యము వ్యక్త మగుచున్నది. మధుర, తిరుచురాపల్లి,

శ్రీరంగము మొదలైన దివ్యస్థలములలో కళాఖండము లనదగిన ఆలయములు విశ్వనాథ నాయకుని కాలములోనే వెలసెను. వివాద ములు పరిష్కరించుటలో అతడు కడు కుశలుడని ఒక శాసనము వలన తెలియుచున్నది. అనగా అతడు సహనశీలి అనియు, బుద్ధికుశలు డనియు చెప్పవచ్చును. ఈ వివిధగుణములు విశ్వనాథ నాయకుని పేరు పెంపులకు హేతువు లయ్యెను

బహుముఖ ప్రతిభాశాలి అయినప్పటికిని విశ్వనాథ నాయకుడు విజయనగర సార్వభౌమునియందు వినయవిధేయతలు ప్రకటించి అతని కార్యకర్తగా మాత్రమే వ్యవహరించెను. అచ్యుత దేవరాయ లయు, సదాశివరాయలయు సార్వభౌమాధికారమును అతడు అంగీక రించెను. తుదకు అళియ రామరాయలచే అనుజ్ఞాతుడై దక్షిణదేశపు ప్రతినిధి విఠ్ఠలరాయలు మధురకు వచ్చినప్పుడు, అతనితో విశ్వనాథ నాయకుడు సఖ్యభావమున సంచరించెను. సముద్రతీరపు గ్రామము లందు ప్రాబల్యము వహించిన బుడతకీచులయు, క్రైస్తవ మతమును స్వీకరించిన పరవజాతివారలయు, తిరువడి రాజ్యాధిపతియు విజృంభణ మును అణచివైచి విఠ్ఠలరాయలు వారియొద్దనుండి కప్పము గ్రహించెను. ఆ సందర్భమున విశ్వనాథ నాయకుడును అతని కుమారుడు కృష్ణప్ప నాయకుడును విఠ్ఠలరాయలకు విశేషముగా తోడ్పడిరి.

మధురనాయక రాజ్యమునకు మూలస్తంభము అనదగిన విశ్వనాథ నాయకుడు ఎప్పుడు దైవికము చెందెనో ఇదమిత్థముగా చెప్పలేము. 1564, జనవరిలో కృష్ణప్ప నాయకుడు సింహాసనమునకు వచ్చినట్లు తెలియవచ్చుటచే, అంతకు మునుపే, విశ్వనాథ నాయకుడు కాలధర్మము చెందినట్లు భావింపవచ్చును. మరణించునాటికి అతడు

రమారమి 75 యేండ్ల వృద్ధుడని శ్రీ సత్యనాథ అయ్యరును, 60 కి పైబడి అతడు జీవించియుండలేదని శ్రీ రంగాచారియు పేర్కొనిరి.

---

1. తెలుగున వెలసిన చారిత్రక లేఖనములలో నాయకశబ్దము నకు మారుగా 'నాయనయ్య', 'నాయనయ్యవారు' అని తెలుగు దనము ఉట్టిపడు చక్కని మాటలు కానవచ్చుచున్నవి. విశ్వనాథ నాయని స్థానాపతి రచించిన రాయవాచకములో ఇట్లు కలదు. "శ్రీమంతు సకలగుణ సంపన్ను లయిన మహామేరు సమానధీరు లైన అఖండిత లక్ష్మీ ప్రసన్నులయిన శ్రీ మన్మహామండలేశ్వర రాజమాన్య మహారాజరాజశ్రీ కాశీవిశ్వనాథ నాయనయ్యవారి దివ్యశ్రీ పాదపద్మములకు...." శాసనములలో కూడ "....నాయ నయ్యవారి వ్రాలు" అని ఉన్నది.

2. మంత్రిపదవినే కాక సైన్యాధ్యక్ష (దళవాయి) పదవిని కూడ నిర్వహించుటచే, అతనికీ బిరుదు కలిగెను. అరియనాథ మొదలికి అరియనాయక ముదలి, నయినా ముదలి అను నామాం తరములు కలవు. తండ్రి పేరు కాళత్తియప్ప ముదలి. తొండమండల వేళాళర్ కులమునకు చెందినవాడు. కాంచీపురమునకు దగ్గరలో ఉన్న మెయ్ప్పేడు అను కుగ్రామములో జన్మించెను.

3. సేలం, కోయంబత్తూరు జిల్లాలు విశ్వనాథనాయకుని కాలమున గాక ముద్దు తిరుమల శౌరి నాయకుని కాలమున (1623-59) మధురకు సంక్రమించియుండ నోపునని కొందరు తలచుచున్నారు.

4. ఈ విభజనమూలముగా 'డెబ్బదిరెండు పాళెములను జయించినవాడు' అను అర్థము నొసగు 'అరుహన్నిబ్బరగండ' అను బిరుదము విశ్వనాథ నాయకునికి కలిగెను. సత్యభామాసాంత్వనము నందలి "డెబ్బది రెండు రాజుల...." అను పద్యమును ఈ సందర్భమున పరిశీలింపదగును.

డెబ్బదిరెండు పాళెములు :

పాంచాలంకురిచ్చి, ఎట్టియాపురం, నాగలాపురం, ఏళాయిరం పణ్ణై, కాడల్‌కుడి, కుళత్తూర్, మేల్‌మాన్దై, ఆట్రంగరై, కొల్లపట్టి, కోలార్‌పట్టి, కడంబూరు, మణియాచ్చి, తలైవన్‌కోట్టై, నెర్కట్టుం జేవల్, చొక్కంపట్టి, ఊట్రుమలై, చేట్రూరు, శివగిరి, సింగంపట్టి, అళకాపురి, ఊర్కాడు, సురండై, సంతయూరు, ఎళుమలై, ఇరళక్కనూరు, కోట్టైయూరు, మరుంగాపురి, మన్నారు కోట, పావాలి, లక్కయనూరు, ముల్లైయూరు, కడవూరు, ఇడయకోట, విలకోట, దేవారం, రామగిరి, కలోప్పేదు, కన్నివాడి, తొట్టప్పనాయకనూరు, కంబం, కాశైయూరు, వారాపూరు, తోగైమలై, పడదూరు, అయ్‌కుడి, సముత్తూరు, విరూపాక్షి, పటమత్తూరు, కంతవనాయకనూరు, కామనాయకనూరు, తుంబుచ్చినాయకనూరు, నత్తం, వెళ్లికున్ద్రం, మలయపట్టి, వడకరై. అమ్మయనాయకనూరు, బోడినాయకనూరు, చక్కంది, మదవానైయూరు, చోచలైపట్టి, వీరమలై, పెరియకుళం, కురువిక్కుళం, ఆత్తిపట్టి, ఇళశై,

మదువార్పట్టి, కోంబై, గూడలూరు, గవుండన్‌పట్టి, కుమరవాడి, ఉదయప్పనూరు, కొల్లకొండాన్.

ఈ పాళెగార్లలో కొందరు తెలుగువారు; కొందరు కన్నడిగులు. మరికొందరు ప్రాచీన పాండ్యుల సంతతికి చెందినవారు.

(శ్రీ అ. కి. పరందామనార్ : మదురై నాయక్కర్ వరలాఱు, పు. 103.)

5. 1560 లో వేయబడిన ఒక తామ్రశాసనము.

# 3

# మొదటి కృష్ణప్పనాయకుడు

## [1564–1572]

విశ్వనాథనాయకుని మరణానంతరము అతని కుమారుడు పెద కృష్ణప్ప నాయనయ్య రాజ్యమునకు వచ్చెను. చరిత్రకారులు అతనిని మొదటి కృష్ణప్పనాయకుడని వ్యవహరింతురు.

కృష్ణప్పనాయకుడు తండ్రివలె దైవభక్తుడు. ప్రజారంజక పాలకుడు. తండ్రికాలములోనే అతడు గొప్పవాడని పేరు సంపాదించెను.

పూర్వపు పాండ్యరాజుల సంతతివారితో సఖ్యభావమున సంచరించిన కారణమువలన, రాజ్యములో శాంతిభద్రతలు నెలకొల్పుటయే కాక అతడు పాండ్యకులస్థాపనాచార్య అను బిరుదమును కూడ పొందెను. శ్రీమత్కాంచీపురవరాధీశ్వర, మోకాలి పట్టవర్ధన, సమయద్రోహరగండ, ఇలావలీపురవరాధీశ్వర, తిరువడిక్ష్మాప, దక్షిణ మహాసముద్రాధీశ్వర—అను బిరుదములు కూడ అతనికి ఉండెనని తెలియుచున్నది.

కృష్ణప్పనాయకుడు సింహాసనమునకు వచ్చినతోడనే మధుర రాజ్యములో ఒక తిరుగుబాటు జరిగెను. దానికి నాయకత్వము వహిం

చినవాడు తుంబుచ్చి నాయకుడను పాళెగారు. అతడు మహా సాహసుడు విశ్వనాథనాయకుడు ప్రవేశపెట్టిన పాళెము పద్ధతిని నిరసించి అతడు కొందరు పాళెగార్లను కూడగట్టుకొని కృష్ణప్పనాయకుని ప్రతిఘటించెను. కనుక విశ్వనాథనాయకుని పాళెపు పద్ధతి అతని కాలమున శాంతి భద్రతలు ప్రసాదించినను, అతని మరణానంతరము ఆ విధానము అనర్థదాయకముగా పరిణమించెనని నుడువ దగును.

కృష్ణప్పనాయకుని కాలమున కూడ మహా మేధావి అయిన అరియనాథ మొదలి దళవాయి ప్రధానిగా ఉండెను అతని అభిమతము ననుసరించి కృష్ణప్పనాయకుడు తుంబుచ్చి నాయకునితో యుద్ధము సాగించుటకు సైన్యాధ్యక్షుడగు పెదకేశవప్ప నాయకుని నియోగించెను. పెదకేశవప్ప నాయకుడు స్వామిభక్తులైన కొందరు పాళెగార్ల సహాయముతో తుంబుచ్చి నాయకుని ప్రతిఘటించెను.

ఉభయ పక్షముల వారికిని జరిగిన ఆ యుద్ధమున తుంబుచ్చి నాయకుడే విజయము సాధించెను. దళవాయి పెదకేశవప్ప నాయకుడు వీరస్వర్గము అలంకరించెను.

పెదకేశవప్ప నాయని మరణానంతరము, అతని కుమారుడు చినకేశవప్ప నాయడు సైన్యాధ్యక్షుడుగా నియమితు డయ్యెను. తుంబుచ్చి నాయకునితో మరల యుద్ధము ప్రకటింపబడెను. ఇరు పక్షముల వారికిని పరమకుడి అనుచోట భయంకరమైన యుద్ధము జరిగెను. అందులో తుంబుచ్చి నాయకుడు చినకేశవప్ప నాయనికి పట్టుబడెను. పిమ్మట అతడు కృష్ణప్పనాయకుని ఆజ్ఞను తలదాల్చి తుంబుచ్చినాయకుని శిరచ్ఛేదము కావించి, ఆ శిరస్సును ప్రభు సమక్షమున ఉంచెను. అటుల విద్రోహచర్య తలపెట్టిన తుంబుచ్చి నాయకుని జీవితము విషాదాంతముగా పర్యవసించుటచే మిగిలిన పాళెగార్లు మధురాపురాధీశ్వరుని యందు భక్తి ప్రపత్తులతో సంచరింపసాగిరి.

స్వామి ద్రోహము చేసిన కారణముచే తుంబిచ్చి నాయకుని శిరచ్ఛేదము కావించెనేకాని సహజముగా పెదకృష్ణప్ప నాయనయ్య కఠిన మనస్కుడు కాడు. కనుకనే అతడు తుంబిచ్చి నాయకుని కుమారులిద్దరిని మన్నించి వారిని పరమకుడి, పరంబూరు అను పాళెము లకు అధికారులుగా నియమించి తన సహృదయతను ప్రదర్శించెను.

తుంబిచ్చి నాయకుని మరణానంతరము కృష్ణప్ప నాయకుడు మరియొక తీవ్ర ప్రతిఘటనమును ఎదుర్కొనవలసి వచ్చెను. సింహళ ద్వీపమునకు రాజధానీ నగరమైన కండిని పరిపాలించు నతడు తుంబిచ్చి నాయకుని ప్రాణస్నేహితుడు. మిత్రుని దుర్మరణము అతని హృదయమును కలచివైచెను. కాగా, కండిరాజు నలుబదివేల సైన్య మును సమకూర్చుకొని కృష్ణప్ప నాయకునితో యుద్ధము ప్రకటిం చెను. అతడును సమర సన్నద్ధుడయ్యెను. దళవాయి చినకేశవప్ప నాయని నాయకత్వమున మధుర సైన్యములు సింహళ సైన్యమును పుత్తాళం అనుచోట మార్కొనెను. ఉభయులకు జరిగిన ఆ సమరములో సింహళ వీరులు పలువురు మరణించిరి. చినకేశవప్ప నాయనికి జయము లభ్య మయ్యెను.

అపజయము పొందినను కండిరాజు నిరుత్సాహము చెందలేదు. కాని అతని మంత్రులు, సైనికోద్యోగులు మొదలగువారు ధైర్యోత్సాహ ములు కోలుపోయి యుద్ధమును విరమింపుడని తమ యేలికను కోరిరి. కాని అతడు వారి మాటలను లెక్కసేయక మరల అరువదివేల సైన్య మును ఎటులనో కూడగట్టుకొని దళవాయి చినకేశవప్ప నాయనితో యుద్ధమునకు దిగెను. బుడుతకీచులు కండిరాజునకు సహాయము చేసినట్లు తెలియుచున్నది. ఆ యుద్ధములో కూడ అంతిమ విజయము మధురకే లభించెను. కండివీరు లనేకులతోపాటు కండిరాజు కూడ

యుద్ధములో మరణించెను. ఈ విజయ వృత్తాంతము మధురనాయక రాజుల చరిత్ర యందేకాక తెలుగుల చరిత్రలో కూడ బంగరుటక్షరములతో వ్రాయదగినది. భారత సీమావధులనుకూడ దాటిపోయి సింహళమున పరిపాలనము సాగించినారు ఆనాటి తెలుగువారు![2].

అటుపిమ్మట కృష్ణప్పనాయకుడు తన "బంధువులందరిని సముఖాన్కి రప్పించి చూచి అందులో యోగ్యుడున్ను బుద్ధిమంతుడున్ను మహా పరాక్రమశాలిన్ని ఆకారరేఖా మహారాజ లక్షణవంతుడైన (తన) బావమరిది విజయగోపాల నాయని వారిని నీవు సింగ్గళ ద్వీపానికి రాజుగా వుండుమని, పురోహితుల రప్పించి మంచి దినమున్ను లగ్గమున్ను ముహూర్తమున్ను చూచి ఆ దినమంద్దు అచ్చటి గంగా జలమున్ను ఆ దేశమంద్దుగల పుణ్యనదుల తీర్థములున్ను తెమ్మని అతన్కి అభిషేకం చేసి స్వర్ణపట్టం మీద వ్రాయించి లలాటమున ధరియించ్చి .... అంబారిలో విజయగోపాల రాజును సవారి గమ్మని సింహళ రాజుకు కలిగిన బిరుదులున్ను పాండ్యదేశాధిపత్కి కలిగిన బిరుదులున్ను యిచ్చి ..." విజయగోపాలనాయకుని సింహళములో మధుర రాజ్యాధిపతి ప్రతినిధిగా నియమించెను[3]. అతని మూలముగా కండిరాజునుండి కృష్ణప్పనాయకుడు కప్పము గొనుచుండెను. ఈ ప్రతినిధి నియామకమును కొందరు శంకించుచున్నారు. కాని ఒక్క విషయము మాత్రము స్పష్టము. కండిని స్వాధీనము చేసికొన్న తరువాత కృష్ణప్ప నాయకుడు తన్నగరపాలకునినుండి కప్పము గ్రహించుచుండెనని చెప్పవచ్చును.

విశ్వనాథనాయకునివలె విశేషముగా దానధర్మములు చేసియు, గుళ్ళు గోపురముల కట్టించియు, చిట్టడవులు ఛేదించి గ్రామములు నిర్మించియు, చెరువులు త్రవ్వించియు విశేష విఖ్యాతి గడింపకున్నను,

మొదటి కృష్ణప్పనాయకుడు సింహళద్వీపమును జయించిన తెలుగు మన్నీడుగా పేరు గడించినాడు. అతడు ఒక్కడే కాదు; ఆనాటి తెలుగు వీరులు కూడ 'మేరు సమాన ధైర్యయశస్తిలకులు'గా చరిత్రలో చిరయశస్సు గడించినారు.

---

1. దళవాయి పెదకేశవప్ప నాయని పక్షము వహించిన సరదార్లు: బంగారు నాగుల నాయడు, తోరయూరు నరసింహ నాయడు, మిట్టపాలెం అయ్యప్ప నాయడు, గొజ్జంగి కోసల నాయడు, అమరగంటి ముద్దుల నాయడు, సుబ్బనాయుడు, తుపాకుల రామకృష్ణ నాయడు, వీరబాణం కస్తూరి రంగరాజు, లింగమరాజు, కొరవి కృష్ణమరాజు, మందపాటి రాఘవరాజు, ఆవులమంద కృష్ణరాజు, వీరవల్లి రామరాజు, మల్లీవురం రంగనపతిరాజు, పూసపాటి కొండ్రాజు, పెమ్మసాని రుద్రప్ప నాయడు, నాదెళ్ళ నార(ణ)ప్ప నాయడు, నారిగంటి నరసా నాయడు, నరావుల వెంకట్రామానాయడు – మొదలగువారు.

(సింహళ విజయం కైఫీయత్తు; ఇది చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున కలదు.)

2. ఈ యుద్ధములో చినకేశవప్ప నాయని అల్లుడగు మంగపతి నాయడు కూడ పాల్గొనినట్లు తెలియుచున్నది.

3. చారిత్రక లేఖనములలో, కృష్ణప్ప నాయకుని సింహళ విజయము ప్రస్తావింపబడెను. కాని యీ విజయోదంతమును సమర్థించు శాసనాధారము లేదు. యుద్ధకారణము ఇదమిత్థ మని యూ తెలియవచ్చుట లేదు.

# 4

# రెండవ కృష్ణప్ప నాయకుడు

## [1595 – 1601]

వీరప్పనాయకునికి కుమారకృష్ణప్ప, విశ్వప్ప, కస్తూరి రంగప్ప అను ముగ్గురు కుమారులు ఉండిరి. వీరప్పనాయకుని మరణానంతరము రాజ్యమునకు వచ్చిన కుమార కృష్ణప్ప తమ్ముడు విశ్వప్పతో కలిసి దొరతనము చేసినట్లు తెలియుచున్నది. కాని విశ్వప్ప నాయకుడే జ్యేష్ఠుడని సత్యభామాసాంత్వనములోని అవవారిక వలన తెలియుచున్నది.1 రెండవ వేంకటపతిరాయలు వేయించిన కూనియూరు పత్రములలో మధురనాయక రాజవంశ వృక్షము (విశ్వనాథ నాయకుని నుండి తిరుమల నాయకుని వరకు) కానవచ్చుచున్నది. అందులో కూడ విశ్వప్పనాయకుడు పేర్కొనబడెను; కాని కృష్ణప్పనాయకుని ప్రశంస లేకపోవుట చింత్యము.

రెండవ కృష్ణప్ప నాయకుని కాలములోను అరియనాథ మొదలియే దళవాయి ప్రధానిగా ఉండెను. మధుర నాయకరాజ్యము మూడు పువ్వులు ఆరు కాయలగుటకు విశేషముగా తోడ్పడిన వారిలో అతడు ఒక డనుట నిస్సంశయము. నాయక రాజులవలె, అరియనాథ మొదలియు దైవభక్తుడు; దానధర్మములు ఎన్నో చేసిన దానవినోదుడు.

విశ్వనాథ నాయకునితో కలిసి అతడు ధర్మకార్యములు చేసెను. సుందరేశ్వరాలయములో ఆతడు వేయికాళ్ళ మండపము నిర్మించెను. అశ్వారూఢుడై ఉన్నట్లుగా ఆతని విగ్రహ మొకటి మధురలోని పుదు మండపమున కానవచ్చుచున్నది. ప్రజ్ఞామూర్తిగా రాజనీతి విశారదు డుగా వార్త కెక్కిన అరియనాథ మొదలి 1600 లో మరణించెనని తెలియుచున్నది. అతని మరణము మధురనాయక రాజ్యాభ్యున్నతికి అడ్డు తగిలె ననుట అత్యుక్తి కానేరదు. కాని ఒక చరిత్రకారుడు మాత్రము 'అభ్యుదయ నిరోధకుడు' మరణించెనని పేర్కొనెను.

అరియనాథ మొదలి మరణానంతరము పాండ్యపార్థివ కృష్ణ నృపతి అని యశస్సు గడించిన రెండవ కృష్ణప్ప నాయకుడు కూడ మరణించెను. ఆతని మరణమునకు పూర్వమే విశ్వప్పనాయకుడు కూడ విగతజీవు డయ్యెను. కాగా, విశ్వప్పనాయకుని కుమారుడు ముద్దుకృష్ణప్ప నాయకుడు రాజ్యమునకు వారసు డయ్యెను. కాని రెండవ కృష్ణప్ప నాయకుని తమ్ముడయిన కస్తూరి రంగప్ప సింహాసనమును ఆక్రమించెను. ఆకారణమున అతడు ప్రజాభిమానమును కోల్పోయెను. సింహాపీఠిని అలంకరించిన ఒక్క వారములోనే అతడు హత్యచేయబడెనట! ఈ విషయమును మదురైత్తల వరలారు అను తమిళ చారిత్రక లేఖనము తెలుపుచున్నది. అటుపిమ్మట ముద్దు కృష్ణప్ప నాయకుడే 1601 లో రాజ్యమునకు వచ్చెను.

---

1. 'ఆ వీరవిభుడు తిరుమల
దేవీ రమణీయ లీల దేలుచు విశ్వా
ర్యావిభు గుమారకృష్ణ
క్ష్మావరు గస్తూరిరంగ జనపతి గాంచెన్.

# 5

# ముద్దుకృష్ణప్పనాయకుడు

[1601 - 1609]

ముద్దుకృష్ణప్ప నాయకుడు రెండవ కృష్ణప్ప నాయకుని కుమారుడను ప్రవాదము ఒకటి కలదు. కాని సత్యభామాసాంత్వనములోను, మదురైత్తల వరలారులోను అతడు విశ్వప్పనాయకుని కుమారుడని స్పష్టముగా పేర్కొనబడినది.

నాయకరాజ్య స్థాపనము జరిగిన నాటినుండియు నాయక రాజులు ఎంతసేపటికిని తమ రాజ్యభాగములను మాత్రమే శత్రు దుర్భేద్యము చేసికొనుచుండిరి. కాని సముద్రతీరమున ఉన్న రాజుల ప్రాబల్యమును కాని పాశ్చాత్య వర్తకుల పలుకుబడిని కాని వారు గుర్తించలేదు. అందువలన బుడతకీచులు, క్రైస్తవ మతప్రచారకులును సముద్రతీరపు భాగములను తమ గుప్పిట ఉంచుకొనిరి. అటుల అధికారము సంపాదించినవారిలో పేర్కొనదగినవారు సేతుపతులు.

సేతుపతులు మరవ జాతివారు; మరవ దేశమునకు చెందిన వారు. మరవదేశ మనగా నేటి రామనాథ పురము జిల్లా. తొలుత వారు రామేశ్వరమును ముఖ్యపట్టణముగా చేసికొని సేతువును సంరక్షించుచుండిన కారణమున వారికి సేతుపతులు అను వ్యవహార నామము కలిగెను.

సేతుపతుల అధికారమును గుర్తించి మరవ దేశములో శక్తిమంతమగు ప్రభుత్వమును ముద్దుకృష్ణప్ప నాయకుడు నెలకొల్పెను.

అందువలన సేతుపతులు అతనిపై కత్తి కట్టిరి. తమ దేశముగుండా రామేశ్వరమునకు పోవు యాత్రికులను వారు బాధింపజొచ్చిరి. ఆ విషయమును తెలిసికొని ముద్దుకృష్ణప్ప నాయకుడు సేతుపతులను అణచివైచి, యాత్రికులకు రక్షణ కల్పించెను. కడపట వారు మధుర రాజ్యాధిపతికి సామంతులై కప్పము కట్టుటకును సమ్మతించిరి.

ముద్దుకృష్ణప్ప నాయకుని మతసహిష్ణుతను పురస్కరించుకొని రాబర్ట్ డి నొబిలీ అను పాదిరీ 1606 లో మధురకు వచ్చెను. రోమ్ నగరము అతని జన్మస్థానము. మధురను మెట్టినతోడనే క్రైస్తవ మతము ప్రజాదరమును చూరగొనలేదని అతడు గ్రహించెను. తనకు ముందున్న ప్రచారకులు అవలంబించిన విధానములలోని బాగోగులను క్షుణ్ణముగా పరిశీలించెను. కొన్నాళ్ళు గడచెను. అతడు ఒక క్రొత్తవిధానమును అవలంబించెను. బ్రాహ్మణుల ఆచార వ్యవహార ములను అనుసరించుట, ఒక్క సంస్కృతమునే కాక తెలుగు, తమిళము మొదలైన ప్రాంతీయ భాషలను కూడ నేర్చుట — అనునవి అతడు చేపట్టిన విధానములోని ముఖ్యాంశములు. తాను రోమ్ నగరపు బ్రాహ్మణుడనని చెప్పుకొనుచు ప్రాంతీయ భాషలలో మతప్రచారము చేయసాగెను. అతని వేషములో మార్పు ఏర్పడెను; ఆహారములోను మార్పు ఏర్పడెను. అచిరకాలములోనే అతని కృషి ఫలించెను. నిమ్న జాతులవారే కాక సవర్ణులలో కూడ పలువురు అతనిమాటలు నమ్మి క్రైస్తవమతమును స్వీకరించిరి.

తన పూర్వులవలె ముద్దుకృష్ణప్ప నాయకుడు కూడ గుళ్లు గోపుర ములు కట్టించెను; తటాకములు త్రవ్వించెను. కన్యాకుమారిలోని భగవత్యాలయమునకు విరివిగా దానధర్మములు చేసెను. ఎనిమిదేండ్ల పరిపాలనకు పిమ్మట ముద్దుకృష్ణప్ప నాయకుడు 1609 లో మరణిం చెను. అనంతరము అతని జ్యేష్ఠకుమారుడు ముద్దువీరప్పనాయకుడు సింహాసనమునకు వచ్చెను.

# 6

# మొదటి ముద్దు వీరప్ప నాయకుడు

## [1609 - 1623]

ముద్దుకృష్ణప్ప నాయకునికి ముగ్గురు కుమారులు. వారు ముద్దు వీరప్ప, ముద్దు తిరుమలశౌరి, కుమార ముద్దు అనువారు. కాని సత్య భామాస్వాంతనములోను మదురైత్తల వరలారులోను ముద్దు వీరప్ప, ముద్దు తిరుమలశౌరి నాయకులు మాత్రమే ఉదాహరింపబడిరి.

మధురనాయక రాజుల చరిత్రలో ముద్దు వీరప్ప నాయకుని పరిపాలన కాలము చాల ముఖ్యమైనది. అతని కాలమున రాజకీయముగా మార్పులు ఏర్పడెను. విశ్వనాథ నాయకునినుండి మొదటి కృష్ణప్ప నాయకుని దాకా గల రాజు లందరు విజయనగర సమ్రాట్టుల నెడ వినయవిధేయతలు ప్రకటించి, వారికి సామంతులై వ్యవహరించిరి. ఆ సంబంధము ముద్దు వీరప్పనాయకుని కాలములో సడలిపోజొచ్చెను. అతనికి పిమ్మట రాజ్యమునకు వచ్చినవారు సర్వ స్వతంత్రులుగా వ్యవహరించసాగిరి. అందువలన విజయనగరాధీశ్వరులకును మధుర నాయకరాజులకును మధ్య రవరవలు ఏర్పడి అవి తుదకు రణరంగ ములుగా పర్యవసించెను. ముద్దు వీరప్ప నాయకుని కాలములో కూడ విజయనగరమునకును మధురకును నడుమ సఖ్యసంబంధము ఉండె ననియే శ్రీ రంగాచారి విశ్వసించిరి.

ముద్దు వీరప్పనాయకుడు విజయనగరాధీశ్వరు నెడ అవిధేయ తతో సంచరించుటకు కారణము ఆనాటి అప్రశాంత రాజకీయ వాతా వరణమే అనవచ్చును. అతడే కాదు, విజయనగరాధీశ్వరుని సామం తులు మరికొందరు కూడ స్వాతంత్ర్యము ప్రకటించిరి.

అచ్యుతదేవరాయలకు పిమ్మట సదాశివరాయలు విజయనగర సింహాసనమును అధిష్ఠించెను. అతడు పేరునకు మాత్రమే రాజు. అధికారము కృష్ణదేవరాయల అల్లుడు అళియరామరాయల హస్తగతమై ఉండెను. అతని సోదరులు తిరుమల, వేంకటాద్రులు కూడ అతనికి తోడునీడగా ఉండిరి. అట్లుండగా, 1565 లో రక్షస్థగిడి (తళ్లికోట) యుద్ధము జరిగెను. విజయనగర సామ్రాజ్య చరిత్రను తలక్రిందులు చేసిన ఆ ఘోరసంగ్రామములో అళియరామరాయలు స్వర్గస్థుడయ్యెను. అప్పుడు సదాశివరాయలు తిరుమలరాయలలో కూడి పెనుగొండకు పోయి తలదాచుకొనెను.

సదాశివరాయల మరణానంతరము[1] తిరుమలరాయలు పెను గొండను రాజధానిగా చేసికొని రాజ్యము చేయసాగెను. అతడు గొప్ప వాడనియు, వీరుడనియు తెలియుచున్నది.[2] అతనికి శ్రీరంగరాయలు, రామరాయలు, వేంకటపతిరాయలు అను ముగ్గురు కుమారులు ఉండిరి. వారిని ఆంధ్ర ద్రావిడ కర్ణాటక రాష్ట్రములకు తన ప్రతినిధులుగా నియమించి తిరుమలరాయలు రాజ్యపాలనము చేయసాగెను. అతని అనంతరము శ్రీరంగరాయలు సింహాసనమునకు వచ్చెను. అతడు 21 సంవత్సరములు రాజ్యముచేసి మరణించెను. పిమ్మట వేంకటపతి రాయలు రాజయ్యెను.

1614 లో వేంకటపతిరాయలు విగతజీవు డయ్యెను. అతనికి సంతానము లేదు. రాజకుటుంబములో అల్లరులు చెలరేగెను. వేంకటపతి

రాయల సోదరుడు రామరాయలకు తిరుమలరాజు, శ్రీరంగరాజు అను కుమారులు కలరు. వారు రాజ్యమునకు వారసు లయిరి. తిరుమలరాజు వారిలో జ్యేష్ఠుడు. కాని అతనిపై ఎవ్వరికిని సదభిప్రాయము లేదు. కాగా శ్రీరంగరాజునే తమ రాజుగా ప్రజలు భావించిరి. ఆ సమయమున గొబ్బూరి జగ్గరాజు, మాకరాజు ప్రభృతులు తిరుమలరాజు పక్షము వహించిరి. జగ్గరాజు అంతఃపురమును ప్రవేశించి రాజవంశీయులను వధించినట్లు ప్రతీతి. ఆ విపత్సమయమున వెలుగోటి యాచమనాయకుడు అను మండలాధీశ్వరుడు[4] శ్రీరంగరాజు పుత్రుని సురక్షితముగా తంజావూరికి తీసికొని వెళ్లెను. అప్పుడు తంజావూరిని రఘునాథరాయలు పాలించుచుండెను. రక్షస్తగిడి యుద్ధానంతరము కూడ తంజాపుర నాయక రాజులు విజయనగరాధీశ్వరులయందు వినయవిధేయులై ఉండిరి. యాచమనాయకునికి రఘునాథరాయలు బాసటగా నిలిచిన పిమ్మట అతడు గొబ్బూరి జగ్గరాజుతోను, అతనికి సహాయముగా వచ్చిన వారితోను యుద్ధము చేయ నిశ్చయించెను. అటుపిమ్మట శ్రీరంగరాజు కుమారుడు రామరాయలను రాజుగా చేసి యాచమనాయకుడు విజయనగర సామ్రాజ్యమును నిలబెట్టెను. ఈ రామరాయలను రెండవ రామరాయలు అని చరిత్రకారులు వ్యవహరింతురు.

మధురనాయకరాజు ముద్దు వీరప్పనాయకునితోను, జింజి (తుండీర) విభుడు కృష్ణప్ప నాయకునితోను గొబ్బూరి జగ్గరాజు చెలిమి చేసికొని విజయనగరాధీశ్వరునితో యుద్ధము ప్రకటించెను. అందువలన ముద్దు వీరప్పనాయకుడు విజయనగరముతోను తంజావూరుతోను విరోధము తెచ్చిపెట్టుకొనెను. 1616 లో తమ తమ బలములతో యాచమనాయకుడును జగ్గరాజును తిరుచిరాపల్లికి దగ్గరగా ఉన్న తోపూరు అనుచోట

యుదమునకు దిగెను.[5] ఆ భయంకర యుద్ధములో జగ్గరాజు మరణించెను. అతని మరణానంతరము, అతనికి బాసటగా నిలిచిన వారందరు పశ్చాత్తప్తు లయిరి.[6]

పిమ్మట ముద్దువీరప్పనాయకుడు తంజావూరి రఘునాథ రాయలతో సఖ్యసంబంధము చేసికొనుట శ్రేయస్కరమని తలచి తన కుమార్తెను రఘునాథరాయలకు ఇచ్చి పెండ్లిచేసెను.[7] ఈ సంబంధము వలన మధుర తంజావూరు పాలకులమధ్య నిజమైన సఖ్యత యేర్పడెనని చెప్పుటకు వీలుపడదు.

ముద్దువీరప్పనాయకుని కాలములో అతని తమ్ముడు ముద్దు తిరుమలశౌరి (తిరుమలనాయకుడు) రాజ్య వ్యవహారములలో పాల్గొనుచుండెను. రఘునాథరాయలతో సఖ్యసంబంధము కుదిరినను, తిరుమల నాయకుడు తంజావూరిని హస్తగతము చేసికొనవలెనని అభిలషించెను. బహుశః ఈ కారణమువల్లనే కాబోలు, అతడు 1616 లో తిరుచిరాపల్లిని రాజధానిగా చేసికొనెను. తంజావూరికి తిరుచిరాపల్లి దగ్గరగా ఉండుటచే, ఎప్పటికప్పుడు రఘునాథరాయల గుట్టుమట్టులను తాను తెలిసికొనవచ్చునని అతడు ఊహించియుండవచ్చును. కాని యీ మార్పు తరువాతి అనర్థములకు దారి తీసెను.

అటుల తిరుమలనాయకుడు తంజావూరుతో యుద్ధము చేయుటకు యత్నించుచుండిన కాలములో మైసూరు పాలకుడు రాజా ఉడయరు తాను చిరకాలముగా వేచియున్న తరుణము లభించెనని తలచి మధురను కబళింప దలచెను. మధురనాయకరాజులవలె అతడును తొలుత విజయనగరాధీశ్వరులకు సామంతుడుగా ఉన్నవాడే. రక్షస్థగిడి యుద్ధానంతరము అతడు స్వాతంత్ర్యము ప్రకటించెను. అంతేకాక శ్రీరంగపట్టణమునుండి రామరాయలు కర్ణాటక రాష్ట్రమును పర్య

వేష్టించుచున్న రోజులలో, రాజా ఉడయరు ఆ పట్టణమును తన స్వాధీనము చేసికొనెను. అటుపిమ్మట మధుర తంజావూరు రాజుల మధ్య కల వైమనస్యములను పురస్కరించుకొని అతడు మధురమీదికి దండెత్తుటకు నిశ్చయించెను. కాని 1617 (1620?) లో రాజా ఉడయరు మరణించినట్లు తెలియుచున్నది.

---

1. సదాశివరాయలను సంహరించి తిరుమలరాయలు సింహాసనము నాక్రమించె ననియు, ఈ విషాద సంఘటన 1568 సం॥ న జరిగెననియు కొందరు చరిత్రకారులు విశ్వసించిరి. ఈ విషయము సత్యము కాదని కొందరి అభిప్రాయము. తిరుమలరాయలుగాని, అతని కుమారులుగాని సదాశివరాయలను చెరయందుంచి అతనిని సంహరించలేదు. అతడు సహజ మరణము చెందిన పిమ్మటనే తిరుమల రాయలు సింహాసనము నెక్కెను. బహుశః విరోధు లెవ రైనను తిరుమలరాయలపై ఈ అపవాదు వేసి యుందురు. Further Sources of Vijayanagara History, Vol. 1. పు. 299; 'ఆంధ్ర మహనీయులు.' పు. 55-57.

2. రామరాజ భూషణుని వసుచరిత్రలోని అవతారికా పద్యములు తిరుమలరాయని గుణగణములను కీర్తించుచున్నవి.

"అన్నాతిఁ గూడ హరుఁడగు,
అన్నాతిని గూడకున్న నసురగురుండౌ
అన్నా! తిరుమలరాయడు!

కన్నొక్కటి లేదుగాని కంతుడు కాడే....'' అను చాటు పద్యము నుండి రక్షస్తగిడి యుద్ధములో అతని కన్నొకటి పోయి యుండునని భావింపబడుచున్నది.

3. ఇతడు గొబ్బూరి ఓబలరాయని కుమారుడు; వేంకటపతి రాయలవారి రాణులలో ఒకతె యగు కొండమ్మ (బాయమ్మ?) సహోదరుడు. ఇతడు తంత్రజ్ఞుడని తెలియుచున్నది.

4. ఇతడు పద్మనాయక కులాభరణము. వేంకటగిరి పురాధీశ్వరుడైన వెలుగోటి యాచమనాయని మనుమడు. కస్తూరి రంగప్పనాయని కుమారుడు. వీరెల్లరు వేంకటపతి రాయలవారి సేనాపతులుగా, మండలాధీశ్వరులుగాను ఉండిరి. దామెర్ల వెంగళ భూపాలుడు రచించిన బహుళాశ్వ చరిత్రములో యాచమనాయని గురించి బహుధా ప్రశంస చేయబడెను.

5. మన్నెతోపూర జగ్గరాణ్ముఖుల నొంచి
మధుర దొర, చెంజి మన్నీని మద మడంచి
తిరుచెనాపలి దొర బోలు తేజముగల
మేటి వెలుగోటి యాచని సాటి గలరే.''

6. ఈ యుద్ధమునకు సంబంధించిన వివరములు తంజావూరి విజయరాఘవనాయకుడు సంతరించిన రఘునాథాభ్యుదయమను నాటకములోను, రామభద్రాంబ రచించిన రఘునాథాభ్యుదమను సంస్కృత కావ్యమునందును, యజ్ఞనారాయణ దీక్షితుని

సాహిత్య రత్నాకరమునందును గలవు. రఘునాథాభ్యుదయము నందలి కమ్మవక్కాణములో (గుంటూరి అయ్యపరాజు నారప్ప వ్రాసినది) తోపూరు యుద్ధములో పాల్గొనిన దొరల పేళ్లు, గొబ్బూరి జగ్గరాజు విగతజీవుడైన వృత్తాంతము, అతనికి సహాయముగా వచ్చినవారు పరాభవము చెంది పలాయనము చిత్తగించిన విషయము – మొదలగునవి పేర్కొనబడినవి.

7. బంగారు బొమ్మను పాండ్యభూపాలు
డింగితవేదియై యిచ్చిన మెచ్చి
తంజాపురము చేరి....

# 7

# తిరుమలనాయకుడు

## [1623 - 1659]

విజయనగర సమ్రాట్టు నెడ తిరుమలనాయకుడు ప్రదర్శించిన వైఖరి ఫలితముగా సమ్రాట్టు స్వయముగా మధురమీదికి దండెత్తి రావలసి వచ్చెను. అప్పుడు గత్యంతరము లేక తిరుమల నాయకుడు మహమ్మదీయుల సహాయమును అర్థించవలసి వచ్చెను. రెండవ ముద్దు వీరప్పనాయకుడు విజయనగరాధిపతితో ప్రత్యక్షముగా యుద్ధమునకు దిగలేదు. జగ్గరాజు పక్షము వహించి అతడు యాచమనాయకుని ప్రతిఘటించెను; కాని యుద్ధము ముగిసిన వెంటనే పశ్చాత్తాపము చెందెను. తిర్పుమలనాయకుని విషయము తద్భిన్నము. అతడు విజయ నగరాధిపతితో స్వయముగా యుద్ధమునకు దిగుటయేకాక, చాల కాల ముగా ఉన్న సంబంధమును కూడ త్రెంచివేసెను. రాజకీయమైన యీ పరిణామము ఏర్పడినను, మధురాపురాంధ్ర వాఙ్మయమునకు రాజా శ్రయము లభించినది ఈతని కాలములోనే. గుళ్ళు గోపురములు నిర్మించియు, చిత్రలేఖనాది లలితకళలను పోషించియు అతడు యశో విశాలు డయ్యెను.

ఒక దేశపు సుస్థిరత దాని రాజధానీ నగరముపై ఆధారపడి యుండుననుట విజ్ఞులు ఎరిగినదే. తిరుమలనాయకుడు పాలనాదక్షుడే

అయినను, రాజనీతి మర్మజ్ఞుడే అయినను, మధురనుండి తిరుచిరాపల్లికి రాజధానిని తరలించిన కారణమున తరువాతి కాలములో వాటిల్లిన అనర్థములకు అతడు కారణభూతుడయ్యెను. మధుర పాండ్యమండల మునకు నడిబొడ్డున ఉండెను. కనుక మధురను ముట్టడింపవలె నన్నచో తిరుచిరాపల్లి,దిండుగల్లు కోటలను తొలుత ముట్టడించవలెను. అవి స్వాధీనమైన తరువాతనే మధుర స్వాధీన మగును. తిరుచిరాపల్లి మధుర రాజ్యమునకు ఒక మూలగా ఉండుటవలన, ఆ నగరమును వశము చేసికొన్నచో మధుర రాజ్యమును అనాయాసముగా వశము చేసికొనవచ్చును. అంతేకాక, శత్రువునకు దగ్గరగా ఉండుట అంత క్షేమము కాదు. కనుక తిరుచిరాపల్లిని రాజధానిగా చేసికొనుటవలన తిరుమల నాయకుడు సాధించిన సత్ఫలితములు ఏమియు లేవనుట నిర్వివాదము.

తిరుమలనాయకుని పరిపాలనా సౌష్ఠవమునకు తోడ్పడిన వారిలో తొలుత పేర్కొనదగినవాడు దళవాయి ప్రధాని రామప్పయ్య. అతడు మధురకు ఏడుమైళ్ళ దూరములో ఉన్న చతుర్వేది మంగల ములో జన్మించెను. మహా సాహసుడు, స్వామిభక్తుడును. స్వయముగా యుద్ధములలో పాల్గొన్నవాడు. అతని వంశీయులలో పలువురు ఉన్నత పదవులు అలంకరించిరి.

దళవాయి రామప్పయ్య సాగించిన జైత్ర యాత్రలలో మొదటిది మైసూరు దళవాయి నంజరాజుని[2] ప్రతిఘటించి విజయలక్ష్మిని వరించుట.

మైసూరు పాలకుడు చామరాజ ఉడయరు 1617 లో సింహాసన మునకు వచ్చెను. మధురను వశము చేసికొనదలచి, అతడు 1625లో దళవాయి నంజరాజు నాయకత్వమున కొంత సైన్యమును దిండుగల్లు

దుర్గము మీదికి పంపెను. దిండుగల్లు దుర్గాధిపతి రంగన్న నాయ కుడు[3] నంజరాజు ముట్టడి విషయమును వెంటనే వార్తాహరుల మూల మున తిరుమలనాయకునికి తెలియజేసెను. తోడనే సైన్య సమేతుడై బయలుదేరి రామప్పయ్య దిండుగల్లు చేరుకొనెను. ఆ సైన్యమును చూచి భయభ్రాంతుడై నంజరాజు వచ్చినదారి పట్టెను. అయినను రామప్పయ్య నంజరాజును వెన్నంటిపోయి మైసూరు సమీపమున అతనితో యుద్ధము చేసి విజయము పొందెను.[4]

మైసూరు యుద్ధము ముగిసిన కొంతకాలమునకే రామనాథ పురమును పాలించు దళవాయి సేతుపతితో రామప్పయ్య యుద్ధము చేయవలసి వచ్చెను. దళవాయిః రంగన్ననాయుడు, శివరామయ్య (రామప్పయ్య అల్లుడు), కొందరు పాళెగార్లు రామప్పయ్యకు సహాయ ముగా ఆ యుద్ధములో పాల్గొనిరి. ఆ సందర్భమున పాంబన్ కాలువ మీద ఒక ఆనకట్ట కట్టి రామప్పయ్య సైన్యములను ద్వీపములోనికి తీసికొని వెళ్ళినట్లు తెలియుచున్నది. ఇరుపక్షములకును అపారనష్టము ఏర్పడెను. జయము లభించనున్న సమయమున దళవాయి రామప్పయ్య మరణించెను. అతని మరణమును గురించి అభిప్రాయ భేదములు కలవు. సేతుపతి కావించిన విషప్రయోగమువల్లనో, చేతబడి ఫలితముగానో అతడు మరణించెనని తెనియుచున్నది. అటు పిమ్మటమ శివరామయ్య దళవాయిగా నియమితు డయ్యెను. మరల సేతుపతితో యుద్ధము జరిగెను. అందు సేతుపతి మధుర సైన్యములకు పట్టుపడెను అంతిమ విజయము తిరుమలనాయకునికి లభించెను.

మధుర నాయక రాజుల చరిత్రలో దళవాయి ప్రధాని రామప్పయ్య పేర్కొనదగిన ప్రముఖుడు. విశ్వనాథ నాయకునికి అరియనాథ మొదలి ఎటుల కుడిభుజముగా వ్యవహరించెనో, అటులనే

తిరుమలనాయకునికి రామప్పయ్యాను. యుద్ధసమయములలో మహా కఠినుడై సంచరించినను, అతడు వస్తుతః దయార్ద్రహృదయుడు. స్వస్థలమైన చతుర్వేద మంగలములో అతడు ఒక శివాలయము నిర్మించెను. ఆ కోవెలలో అతని శిలావిగ్రహము కలదట!

ఇక తిరుమలనాయకుడు విజయనగరాధీశ్వరునిపట్ల ప్రదర్శించిన వైఖరిని గమనింతము.

రామరాయలు సింహాసనమునకు వచ్చిన పిమ్మట కూడ సామ్రాజ్యములోని పరిస్థితులు చక్కబడలేదు. రాజకీయముగా వాతావరణము కలుషితమై ఉండెను. చంద్రగిరిని కాక వేలూరును రామరాయలు రాజధానిగా చేసికొనెను. అ సందర్భమున యాచమనాయని బావ మరిది చెన్నప్పనాయడు రామరాయలకు విశేషముగా సహాయపడెను. ఈ చెన్నప్పనాయని సవతి తమ్ముడగు అయ్యప్ప చెన్నప్ప పేరుతో నేడు మదరాసు అని కూడ వ్యవహృతమగుచున్న చెన్నపట్టణమును నిర్మించెను.

రామరాయలకు పిమ్మట మూడవ శ్రీరంగరాజు సింహాసనమునకు వచ్చెను. అతని కాలములోనే విజయనగర, మధుర రాజ్యములకు గల సంబంధము పూర్తిగా విచ్ఛిన్నమై పోయెను. తిరుమల నాయకుని కప్పము చెల్లింపుమని శ్రీరంగరాజు కోరెను. కాని అతడు నిరాకరించెను. అందువల్ల యుద్ధము అనివార్యమయ్యెను. శ్రీరంగరాజును ఎదుర్కొనుటకు తిరుమలనాయకుడు తంజావూరు, జింజి పరిపాలకుల సహాయమును అర్థించెను. వారును సరే అనిరి. యుద్ధము జరిగెను. ఈ అవకాశమును వినియోగించుకొని తరువాతికాలమున మహమ్మదీయులు దక్షిణ భారతములో ఎక్కువ పలుకుబడి సంపాదించిరి.

అటుల తిరుమలనాయకుడు యుద్ధములందు మునిగి తేలుటను చూచి సమయమునకై వేచియున్న మైసూరు పాలకుడు కంఠీరవ నరసరాజు 1656 (?) లో మధుర రాజ్యములోని సత్యమంగలం రాష్ట్రమును ముట్టడించెను. అప్పుడు తిరుమల నాయకుడు యుద్ధమునకు సంసిద్ధుడుగా లేడు. పైపెచ్చు అస్వస్థుడై ఉండెను. చేయునది లేక రామనాథపురమును పాలించు రఘునాథ సేతుపతి సహాయమును అపేక్షించెను.

సేతుపతి 25,000 మరవ వీరులతో మధురకు తరలి వచ్చెను. పిమ్మట 35,000 మధుర సైనికులను కూడగట్టుకొని తిరుమలనాయకుడు కంఠీరవ నరసరాజుతో యుద్ధమునకు దిగెను. తిరుమలనాయకుడే జయించెను. అందుకు తిరుమలనాయకుడు మిక్కిలి సంతోషించి రఘునాథ సేతుపతిని ఘనముగా సత్కరించెను; తిరుమల సేతుపతి అను బిరుదమును కూడ ఇచ్చెను. అంతేకాదు ; సేతుపతి సైన్యములో మరవలేకాక బడతకీచులు, డచ్చివారు మొదలైన వారు కూడ ఉండుటచే వారికి సైతము కొన్ని గ్రామములు బహూకరించెను. ఆ గ్రామములకు సంబంధించినంతవరకు సంపూర్ణాధికారము వారికే ఒసగబడెను. అటుల చేయుటవలన తిరుమలనాయకుని విజయము అంత లాభదాయకము కాదని నుడువదగును.

తిరుమలనాయకుడు సాహసుడైన యుద్ధవీరుడనియు, పరాక్రమశాలి అనియు శాసనములు స్పష్టము చేయుచున్నవి. అతని యుద్ధములు కొంతవరకు ఈ విషయమును బలపరుచుచున్నవి సాహసుడు కాకున్నచో, తొలుత సహాయము చేయుదునని మాట ఇచ్చిన తంజావూరి రాజు సమయమునకు సహాయము చేయకపోయినను తుదకు యుద్ధము చేయుటయేకాక సుల్తాను తోడ్పాటుతో జయము కూడ సాధిం

చెను. ఆ యుద్ధము ముగిసినవెంటనే మైసూరు పాలకునితో యుద్ధము చేయవలసివచ్చెను. అతనికే విజయము దక్కెను. తిరుమల నాయకుడు గజారూఢుడై యుద్ధభూమిని ప్రవేశించినచో వైరి వీరులు భయభ్రాంతు లగు చుండిరట !

విజయనగర సమ్రాట్టునెడ తిరుమలనాయకుడు ప్రదర్శించిన వైఖరి సమంజసమా కాదా అను ప్రశ్న చాల ముఖ్యమైనది. తిరుమల నాయకుని పూర్వు లందరు విజయనగరాధీశ్వరులకు సామంతులై వ్యవహరించగా తిరుమలనాయకుడు మాత్రము అందుకు భిన్నముగా సంచరించెను. పైగా కప్పము కట్టుటకు కూడ నిరాకరించెను. అందు వల్ల అతని వైఖరి స్థూలదృష్టికి అసమంజసముగా కనిపించును. కాని ఆ విధముగా అతడు సంచరించుటకు ప్రబల కారణము ఒకటి లేక పోలేదు.

మధురరాజ్యములో భూమిశిస్తువలన లభించు ఆదాయములో మూడవ వంతును విజయనగర సమ్రాట్టునకు చెల్లించవలెను. కాని అందుకు తగిన ప్రతిఫలము మాత్రము సమ్రాట్టునుండి లభించకుండెను. ప్రతిఫలము ఏమియు పొందక ఊరక కప్పము చెల్లించుచు, సామం తుడుగా ఉండుటకు అతనికి మనస్కరించలేదు. కాగా, విజయనగరా ధీశ్వరులతో గల సంబంధమును తెగత్రెంపులు చేసికొని స్వేచ్ఛగా సంచరించుటకే అతడు అభిలషించెను.

మరియొక కారణము కూడ కలదు. తిరుమలనాయకుని పూర్వులు యుద్ధసమయములలో విజయనగరాధీశ్వరుల సహాయమును కోరు చుండిరి. కాని తిరుమలనాయకుని కాలములో సమ్రాట్టు శక్తివిహీను డగుటచే అతని సహాయము లభించుట దుర్లభ మనిపించెను. కాగా, మధురను సంరక్షించుకొను పూర్తి బాధ్యత తిరుమలనాయకునిపై

పడెను. ఈ దృష్టితో చూచినపుడు తిరుమలనాయకుని వైఖరి కొంత వరకు సహేతుకమని తోచకపోదు. ఏది ఎట్లున్నను, సమ్రాట్టును ప్రతిఘటించినందుకు అతడు చరిత్రకారుల కటూక్తులకు గురి అయినాడు.[6]

తిరుమల నాయకుడు సతతము యుద్ధమునందు నిమగ్నుడై ఉండుటవలన కొంతవరకు రాజ్యపటుత్వము సడలిపోయెనని చెప్ప వచ్చును. పర రాజులు మధురను కబళించుటకు ప్రయత్నింప జొచ్చిరి. వారిలో పేర్కొనదగినవాడు మైసూరు పాలకుడు. యుద్ధము లేమో తప్పనిసరి అయ్యెను. యుద్ధ వ్యయమును భరించుటకు తిరుమల నాయకుడు పన్నులు ఎక్కువ చేసెను. అన్యుల సహాయమునకై అర్రులు చాచెను. వారిని తృప్తిపరుచుటకు కొన్ని గ్రామములు వినియోగింపబడెను. దక్షిణ భారతదేశ రాజకీయములలో మహమ్మ దీయులకు ప్రవేశము కల్పించినవాడు తిరుమల నాయకుడే చివరికి ఆ సుల్తానులు నాయకరాజుల బలహీనతను గుర్తించి తమ అధికారమును విస్తరింపజేసికొనిరి. ఇంతకు యుద్ధములవల్ల తిరుమల నాయకుడు సాధించిన సత్ఫలితములా హుళక్కి! కనుక అతని యుద్ధములు మధురనాయక రాజ్య శ్రేయస్సునకుగాక ఆ రాజ్య పతన స్థితికి పాల్పడెనని చెప్పక తప్పదు. కాగా అతని యుద్ధములు విజయములును నిష్ప్రయోజనము లయ్యెను.

తిరుమలనాయకుడు కేవలము యుద్ధవీరుడని తలచుట సత్య సంపూర్ణము కాదు. అతడు తెలుగుభాషా పోషకుడు. దానశీలుడు. నృత్త గీతాది కళలను ఆదరించిన కళాభిజ్ఞుడు. అతని కొలువు కూట ములో సత్యభామా సాంత్వన కృతికర్త అయిన లింగనమఖి కామేశ్వర కవి మరికొందరు కవులున్నట్లు తెలియుచున్నది. సుప్రసిద్ధ పదకర్త

క్షేత్రయ్య అతని ఆస్థానములో ఉండి రెండువేల పదములు చెప్పినట్లు ప్రతీతి. తిరుమల నాయకుని కాలమునుండి మధురాపురాంధ్ర వాఙ్మయము ప్రారంభ మగుచున్నది. సంగీత సాహిత్యములనే కాక శిల్ప చిత్రలేఖనాది లలితకళలను కూడ ఆదరించెను.

తిరుమల నాయకుడు కట్టించిన సుందరమహాలు బహుథా పేర్కొనదగిన నిర్మాణము. అది అతని కళాభిజ్ఞతకు ధ్వజస్తంభ ప్రాయము. ప్రాచ్య పాశ్చాత్య కళావిమర్శకుల మన్ననలు చూరగొన్న కమనీయ కళాఖండ మది. జేమ్సు ఫెర్గుసన్ అను ప్రఖ్యాత కళాభిజ్ఞుడు ఆ నిర్మాణమును గురించి వేనోళ్ళ కొనియాడెను.7

సుందరమహాలునకు పిమ్మట తిరుమలనాయకుని నిర్మాణములలో ప్రశంసించదగినది పుదు మండపము (క్రొత్త మండపము). దీనిని నిర్మించుటకు 22 సంవత్సరములు పట్టినని స్థలజ్ఞులు చెప్పుదురు. దీనికి వసంతమండపము అను నామాంతరము కలదు. ఇందులో వసంతోత్సవములు జరుగుచుండెనట. దీని పొడవు 333 అడుగులు. వెడల్పు 105 అడుగులు. ఎత్తు 25 అడుగులు. విశ్వనాథనాయకుని మొదలు తిరుమలనాయకుని వరకుగల నాయకరాజుల శిలావిగ్రహములు ఇందులో కలవు.

తిరుమల నాయకుడు నిర్మించిన అంతఃపుర మందిరములు సువిశాలములు, సుందరములును. ప్రస్తుతము వాటిలో మధుర, రామనాథపురము జిల్లాల న్యాయస్థానములు కలవు; ఇంకను తెప్పకుళం, రాజగోపురం, తముక్కం మొదలైనవాటిని నిర్మించుటయేకాక పెక్కు జీర్ణాలయములను కూడ ఆతడు ఉద్ధరించెను. ఈ విషయాదికమును పరిశీలించగా, అతడు దైవభక్తుడనియు, కళాహృదయుడనియు స్పష్ట

మగును. రాజకీయ దృష్టితో కటూక్తులాడిన శ్రీరంగాచారి కూడ అతని కళాభిజ్ఞతకు జేజేలు సమర్పించెను 8

తన పూర్వులవలె తిరుమలనాయకుడు కూడ మత సహిష్ణుత ప్రదర్శించిన విశాలహృదయుడు. అతని మత సహనమును ఆధారము చేసికొని క్రైస్తవమత ప్రచారకులు నిరాటంకముగా తమ మతమును ప్రచారము చేసికొనిరి.

మైసూరు యుద్ధకాలమునాటికే తిరుమల నాయకుడు వ్యాధి గ్రస్తుడై ఉండుటచే, తిరుమల సేతుపతి సహాయముతో విజయము సాధించెను. వ్యాధిగ్రస్తుడైన పిదప అతడు తిరిగి కోలుకోలేదు. తుదకు 1659 లో దైవికము చెందెను. తిరుమల నాయకుడు హత్య చేయబడెననియు, అందుకు అతని మతసహనమే కారణము కావచ్చుననియు కొందరు తలచుచున్నారు. దుష్టమతులు కొందరు తిరుమలనాయకుని హత్యచేయదలచి ఒక కుట్ర పన్నిరట. అతడు ప్రతిరోజు ఆలయమునకు వెళ్లెడివాడు. ఒకనాడు తిరుమలనాయకుడు గుడిలో పూజాదికము నెరపుచుండగా, అతనిని హత్య చేసిరట. ఇందులో సత్యాసత్యములు ఎంతవరకు కలవో తెలియదు; కాని తిరుమలనాయకుడు ఒక గుడిలో మరణించినట్లు తెలియుచున్నది. ' ..అతి వుత్సాహముతో కూడి పట్టంపై వాలి శీమునంజ్జిన గుడివర్కు శీముకట్టి అచ్చట తమ మనుష్యులను వుంచి నంజ్జన గుడిలో దిగియుండిరి. ఈ ప్రకారం వుండే సమయమున మహారాజా తిరుమలనాయనివారు దైవీకం పొంది పోయినారు.... '.9

తిరుమలనాయకుడు భాషాపోషకుడు. కళారాధకుడు. యుద్ధ వీరుడు. అతని సుందర నిర్మాణములు అతని కీర్తి ప్రతిష్ఠలకు శాశ్వత చిహ్నములు!

1. ఇతని జీవిత విశేషాదికమునకు నా 'దళవాయి రామప్పయ్య' నవలను చూడగోరెదను.

2. ఇతనిని నందిరాజని కొందరు వ్యవహరింతురు. నంజరాజు ఆంధ్ర వచన భారతకర్త అయిన కళువె వీరరాజు కుమారుడు, ఇతడు పెక్కు వచన రచనలు వెలయించెను. సంస్కృతములో నృసింహకవి 'నంజరాజ యశోభూషణ' మను అలంకార గ్రంథము వ్రాసెను. హాలాస్యమాహాత్మ్యము, విష్ణుభక్తి విలాసము, హరభక్త విలాసము—మున్నగు రచనలు చేసి నంజరాజు తెలుగు వచన వాఙ్మయమునకు పుష్టి చేకూర్చెను.

3, ఇతడు కన్నివాడిపాళెముపట్టు దొర. చిన్న కదిర నాయకుని కుమారుడు,

4. రామప్పయ్య నంజరాజుతో యుద్ధము చేయు సందర్భమున మధురలో విచిత్ర సంఘటన యొకటి జరిగెను. రామప్పయ విరోధులు కొందరు తిరుమలనాయకుని దర్శించి రామప్పయ్యపై లేనిపోని మాటలు చెప్పిరి. అవి సత్యములే అని నమ్మి తిరుమల నాయకుడు రామప్పయ్యను వెనువెంటనే మధురకు విచ్చేయుమని ఆజ్ఞాపించుచు ఇరువురు వార్తాహరులను యుద్ధభూమికి పంపెను. వారు తిరుమలనాయకుని ఆజ్ఞను రామప్పయ్యకు తెలియజేసిరి. అప్పు డాతడు ఆలోచనలో పడెను. వార్తాహరులు ప్రత్యుత్తర మిమ్మని రామప్పయ్యను తొందరపెట్టిరి. వారి అసభ్యప్రవర్తనము

నకు కోపించి అతడు వారిని పరాభవించెనట! పిమ్మట దళవాయి రంగన్ననాయడు మధురకు పోయి తిరుమలనాయకుని దర్శించి అత నితో రామప్పయ్య స్వామిభక్తుడనియు, నిరపరాధి అనియు విన్నవించెను అంతలో నంజరాజును జయించి రామప్పయ్య మధురకు మరలివచ్చెను. తిరుమలనాయకు డతనిని ఘనముగా సమ్మానించెనట. ఈ కథనములో సత్యాసత్యములు ఎంతవరకు గలవో తెలియదు. రామప్పయ్య విజయము మాత్రము తథ్యము. వివరములకు: శ్రీ వి. రంగాచారి వ్యాసము, ఇండియన్ ఆంటిక్వరి, 1911.

5. "ఇరామయ్యన్ అమ్మానై" అను తమిళ చారిత్రక లేఖనమునందు రామప్పయ్య వీరగాథ కండ్లకు కట్టునట్లుగా అభి వర్ణితము. ఈతని గాథ నేటికిని తమిళనాడులో బహుళ ప్రచార ములో ఉండుట గమనింపదగిన విషయము. సేతుపతితో జరిగిన యుద్ధములో డెబ్బదియిద్దరు పాళెగార్లు పాల్గొనినట్లు అమ్మానై నుడువుచున్నది. వారిపేళ్లు కూడ ఇందు కలవు.

6. శ్రీ వి. రంగాచారి దృష్టిలో తిరుమలనాయకుడు రాజకీయ సంబంధ విచ్ఛేదకుడు (a political iconoclast), పరమ ద్రోహియు (a traitor of the blackest dye).

7. The facade of this hall, like that of almost all the great halls in the South of India, is adorned either with Vyalis—monsters of the lion type trampling on an elephant—or even more generally, by a group consisting

of a warrior sitting on a rearing horse, whose feet are supported on the shields of foot soldiers sometimes slaying men, sometimes slaying tigers. The great temple at Madura is a large and far more important building than the Vasanta Mantapam. It possessess all the characteristics of a first class Dravidian temple...... The temple owes all its magnificence to Tirumala Naik or to his elder brother Muddu Virappa who preceded him and who built the Minakshi nayak Mantapam....

8. ఇండియన్ ఆంటిక్వరి, 1916, పుటలు 149-53.

9. మధుర రాజైన తిరుమలరాయని చరిత్రము (చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము).

# 8

# రెండవ ముద్దు వీరప్పనాయకుడు

## [ 1659 ]

తిరుమలనాయకుని మరణానంతరము అతని కుమారుడు ముద్దు వీరప్పనాయకుడు సింహాసనమునకు వచ్చెను. నాలుగు నెలలు మాత్రమే రాజ్యము చేసిన అదృష్టహీనుడు. అతడు తిరుమలనాయకుని కుమారుడని కొందరు, కాదని కొందరును తలచుచున్నారు. కాని మధుర రాజైన తిరుమలరాయని చరిత్రములో ముద్దు వీరప్పనాయకుడు తిరుమలనాయకుని కుమారు డనియే కలదు.1

రాజ్యమునకు వచ్చిననాటినుండియు రెండవ ముద్దు వీరప్పనాయకుడు రాజ్యరక్షణములోనే నిమగ్నుడై ఉండెను. తొలుత తిరుచిరాపల్లి దుర్గమును శత్రుదుర్భేద్యము చేసెను. దుర్గములో సైనికులను నియమించెను; మందుగుండు వస్తువులను భద్రపరిచెను. ఆభారమును దళవాయి లింగమనాయకునిపై వేసెను. ఎప్పటికైనను మహమ్మదీయులు మధురమీదికి దండెత్తి వత్తురని సందేహించి, తంజావురాధీశుని స్నేహమును అభిలషించెను. కాని అతడు అందుకు సమ్మతించకపోవుట దురదృష్టకరము.

అటుల ముద్దు వీరప్పనాయకుడు తంజావురాధీశ్వరుని చెలిమిని కోరుచున్న సమయములో, నాయక రాజ్యములపై కన్ను వేసియున్న

బీజపూరు సుల్తాను ఆదిల్‌షా తన సేనలను దక్షిణాపథమునకు పంపెను. అది తెలిసికొని ముద్దు వీరప్పనాయకుడు సమరసన్నాహము లలో నిమగ్నుడయ్యెను. ఆ ప్రయత్నములను చూచి బీజపూరు సైన్యములు మధురను జయించుట దుర్లభమని తలచి, తంజావూరిని ముట్టడించెను. బీజపూరు సేనలకును తంజావూరి సేనలకును యుద్ధము జరిగెను. ఉభయపక్షములకును తీరని నష్టము కలిగెను. బీజపూరు సేనలు తంజావూరును ప్రవేశించి ఆ నగరమును కొల్లగొట్టి సాగిరి. కాని అంతకుమునుపే నగరమును చొచ్చిన ఒక దొంగల గుంపు సర్వమును దోచుకొని పోవుటచే, బీజపూరు సేనలకు ఏమియు మిగుల లేదు. కరవులో అధిక మాసము! ఆ రోజులలోనే తంజావూరులో గొప్ప క్షామము ఏర్పడెను. తత్ఫలితముగా, బీజపూరు సైనికులు పలువురు మృత్యుముఖమున పడిరి. అందుకు తోడుగా, వారిలో పరస్పర కలహములు కలిగెను. అటుపిమ్మట బీజపూరు సేనలు తిరుచిరాపల్లిని ముట్టడించుటకు ప్రయత్నించెను. కాని ధైర్యము చాలక ముద్దు వీరప్ప నాయకుడు ఒసగిన ద్రవ్యమును స్వీకరించి బీజపూరు సేనలు తమ దేశమునకు తరలిపోయెను.

నాలుగు నెలలు మాత్రమే రెండవ ముద్దు వీరప్పనాయకుడు రాజ్యము చేసినను అతడు రాజనీతిజ్ఞుడని చెప్పుట సమంజసము. అతని దూరదృష్టియు, చాకచక్యమును కొనియాడదగినవి. తంజాపురాధీశ్వరుని సహాయము కనుక లభించినచో మధుర సుస్థిరముగా ఉండునని అతడు గ్రహించుట అతని రాజనీతిజ్ఞతకు తార్కాణ.

ముద్దు వీరప్పనాయకుని గుణగణములను పరికించునపుడు అతడు స్త్రీలోలుడనియు, ఆ స్త్రీ లౌల్యమే అతని మరణమునకు కారణమయ్యె ననియు చెప్పవచ్చును. అతని మరణానంతరము అతని కుమారుడు చొక్కనాథనాయకుడు రాజ్యమునకు వచ్చెను.

1. "తిరుమలశౌరి నాయనివారు దైవికము చెందిన పిమ్మట అప్పుడు మధురలో వుండగల సమస్తమైన దళకర్తలు, ప్రధానులు మంత్రులు యోచన చేసి రాణాతిరుమలనాయని వారి కుమారుడైన శ్రీ ముద్దువీరప్పనాయని వార్కి రాజ్యాన్కి పట్టాభిషేకము చేయించినారు...."

సత్యభామా సాంత్వనములో ఇట్లు కలదు.

"అల శ్రీ తిరుమలనాథుం,
దలమేలమయందు గాంచె ననఘు చరిత్రో
జ్జ్వల విభవసాంద్ర కీర్తులు,
నెలయంగ గుమార ముద్దువీర నరేంద్రున్."

# 9

# చొక్కనాథనాయకుడు

## [ 1659 – 1682 ]

సింహాసనము అధిష్ఠించునాటికి చొక్కనాథనాయకుడు 16 సంవత్సరముల వయసువాడు. అందువలన ప్రధాని, రాయసము, దళవాయి లింగమనాయకుడు—వీరు ముగ్గురు కలిసి రాజ్యవ్యవహారములు పర్యవేక్షించుచుండిరి. కాని మలినమనస్కులై, రాజ్యాధికారమును పూర్తిగా తమ వశము చేసికొనవలెనని వారు అభిలషించిరి. ఆ అభిలాషతో 40,000 సైనికులను వెంటనిడికొని లింగమనాయకుడు జింజి మండలము మీదికి దండెత్తిపోయి, అటనున్న బీజపూరు సేనాని యొద్దనుండి పెక్కు బహుమతులు పొందెను. అటుల చొక్కనాథనాయకునికి తెలియకుండ వారు పరరాజ్యములపై దండెత్తిపోవుటకును వారు సాహసించిరి.

అంతటితో వారు నిలువలేదు. చొక్కనాథనాయకుని హత్య చేయుటకును ప్రయత్నించిరి. ఆ విషయమును ఒక అంతఃపురపరిచారిక వలన గ్రహించి వెనువెంటనే చొక్కనాథ నాయకుడు ప్రధానిని, రాయసమును శిక్షించెను. దళవాయి లింగమనాయని మాత్రము మన్నించెను. అటుపిమ్మట చొక్కనాథనాయకుడే రాజ్యవ్యవహారములను స్వయముగా పరిశీలింపసాగెను. మంత్రుల దుష్పరిపాలనమును

రోసిన ప్రజలు మిక్కిలి సంతసించిరి. కాని లింగమనాయడు మాత్రము చొక్కనాథనాయకునిపై పగ సాధింపదలచి, జంజి రాజుని కలసికొని అతనిని తిరుచిరాపల్లి దుర్గమును ముట్టడింపుమని ప్రేరేపించెను. 12,000 కాల్బలముతోను, 7,000 అశ్విక దళముతోను అతడు తిరుచిరాపల్లి కోటను ముట్టడించెను.

ఆ సమయమున చొక్కనాథనాయకుని సైన్యములో 50,000 మంది సైనికులే ఉండిరి. తంజావురాధిపతి విజయరాఘవనాయకుడు లింగమనాయని పక్షము వహించెను అట్టి విషమపరిస్థితిలోను చొక్కనాథనాయకుడు ధైర్యస్థైర్యములతో శత్రువులను ప్రతిఘటించెను.

కాని చొక్కనాథనాయకుని ప్రధానమంత్రి శత్రు పక్షమునకు పరోక్షముగా సహాయము చేయసాగెను. కానిఅతని ద్రోహచింతన బయట పడెను. వెంటనే అతనిని పదవినుండి తొలగించి, కొత్త సైన్యమును సమకూర్చుకొని, చొక్కనాథనాయకుడే స్వయముగా సైన్యములను నడిపించుకొని యుద్ధభూమికి తరలివెళ్లెను. అతని ధైర్యసాహసములకు ఆశ్చర్యము చెంది వీరయోధులు పలువురు అతని పక్షము వహించిరి. చొక్కనాథనాయకుని సమరసన్నాహములను చూచి లింగమనాయకుడు జింజి పాలకుడును భగ్నమనోరథులై తంజావూరికి పోయి అట తలదాచుకొనిరి. పిమ్మట 70,000 సైన్యముతో చొక్కనాథ నాయకుడు తంజావూరును ముట్టడించెను. అప్పుడు గత్యంతరము లేక లింగమ నాయడు జింజికి పలాయనమంత్రము పఠించెను. కాగా, చొక్కనాథ నాయకుడు విజయరాఘవ నాయకునితో యుద్ధము చేసెను. ఆ పోరులో విజయ రాఘవ నాయకునికి తీరని నష్టము కలిగెను. అందుకు తోడుగా, తంజావూరులో గొప్ప క్షామము కూడ సంభవించెను. దానిని ఆధారము చేసికొని దచ్చివారు తంజావూరు వారిని మిక్కిలి హింసించిరి. అప్పుడు చాలమంది తమ యిళ్లు వాకిళ్లు విడిచిపెట్టి మధురకు పారిపోయిరి.

అన్నార్తులైన ప్రజలకు ఆహార సౌకర్యములు కల్పింతుమని ఆశ పెట్టి వచ్చినవారు వారిని తమ వలలో వేసికొనిరి! ఆ పిమ్మట ఆ దురదృష్ట వంతులను బానిసలుగా విక్రయించిరట! ఈ విషయాదికము బెర్ ట్రాండ్ అను దొర వ్రాతవలన తెలియుచున్నది.1

ఆ విధముగా దురవస్థలపాలైన తంజావూరి ప్రజలను చొక్క నాథ నాయకుడు ఆదరించి సహృదయుడు అనిపించుకొనెను. వారికి ఆహార సౌకర్యములు కల్పించుటలో తన మన అని చూడక మధుర సైనికులను తంజావూరు సైనికులను సమదృష్టితో చూచెను. క్షుధా ర్తుల స్థితిగతులను స్వయముగా తెలిసికొనుటకై అతడు తిరుచిరాపల్లికి వెళ్ళెను. అటువంటి ప్రజాహితైషి చొక్కనాథ నాయకుడు.

1662 వ సంవత్సర ప్రాంతమున మధుర రాజ్యములో కనీ వినీ ఎరుగని సంఘటనలు సంభవించెనని బెర్ ట్రాండ్ వ్రాతల వలన తెలియవచ్చుచున్నది. పల్లెలలోను పట్టణములలోను దుష్టమృగములు తిరుగుచుండెననియు, వాటివలన ప్రజల ఆస్తిపాస్తులకు అపారనష్టము కలిగెననియు, జ్వరాదులు లేకయే పలువురు మృత్యు ముఖమున పడిరనియు, వికృతాకారముగల శిశువులు జనన మందిరనియు తెలియు చున్నది.

తంజావూరు యుద్ధము ముగిసిన పిమ్మట—ఆ మరు సంవత్స రుమే—అనగా 1663 లో బీజపూరు సైనికులు తిరుచిరాపల్లి కోటను ముట్టడించుటకు విశ్వప్రయత్నము చేసిరి. కాని ఆ దుర్గరాజము వారికి పట్టువడలేదు. పైపెచ్చు వారికి విపరీతమయిన నష్టము కలిగెను. అప్పుడు బీజపూరు సైనికులు తిరుచిరాపల్లి పరిసరముల నున్న పంట చేలమీద పడి పంటలు పాడు చేసిరి. గ్రామములను దగ్ధ మొనర్చిరి. ప్రజలను అమానుషముగా హింసించిరి. శత్రుసేనల పైశాచిక చర్యలను భరించలేక మానధనులైన ప్రజలు తండోపతండములుగా ఒక

యింటిలో చేరి ఆ యింటికి నిప్పుపెట్టుకొని ప్రాణములు కోల్పోయి రట! అటుల ఏదో ఒక విధముగా ప్రజలు దుర్మరణమునకు పాల్పడ దలచిరట! అటుపిమ్మట చొక్కనాథ నాయకుని యొద్ద కొంత ధన మును గ్రహించి బీజపూరు సైనికులు మధుర రాజ్యమునుండి నిష్క్ర మించినట్లు విదిత మగుచున్నది.

బీజపూరు సైనికుల బెడద తీరిపోయిన తరువాత తనకు ద్రోహము తలపెట్టి శత్రుపక్షము చేరిన తంజావూరి విజయ రాఘవ నాయకునిపై పగ తీర్చుకొను ఉద్దేశముతో చొక్కనాథ నాయకుడు తంజావురాధీశ్వరుని అధీనములో ఉన్న వల్లం దుర్గమును ముట్టడిం చెను. విజయరాఘవ నాయకుడు అతనిని ప్రతిఘటించెను. కాని లాభము లేకపోయెను.

వల్లం దుర్గము స్వాధీనమైన తర్వాత చొక్కనాథ నాయకుడు మరవ దేశాధిపతి అయిన తిరుమల సేతుపతితో యుద్ధము చేయవలసి వచ్చెను, ఎందుకనగా, రఘునాథ సేతుపతి తిరుమల నాయకునిచే సమ్మానితుడైన నాటినుండియు సర్వస్వతంత్రుడై సంచరించసాగెను. ఆ కారణముననే, బీజపూరు సేనానితో యుద్ధము సంభవించినపుడు చొక్కనాథ నాయకుడు సేతుపతి సహాయమును కోరినను, అతడు సహాయము చేయ నిరాకరించెను. కాగా, సేతుపతిని అణచుటకై అతని అధీనములో ఉన్న తిరుపత్తూరు, పుదుక్కోట, మానామధుర మొద లైన దుర్గములను ముట్టడించి విజయము సాధించి, చొక్కనాథ నాయ కుడు వాటిని తన సేనాపతుల స్వాధీనము కావించెను. చొక్కనాథ నాయకుడు మధురను చేరుకొన్నంతనే, రఘునాథ సేతుపతి చొక్క నాథ నాయకుని సేనాధిపతులను ప్రతిఘటించెను. వారు బలహీను లగుటచే,వారిని అనాయాసముగా జయించి అతడు కోల్పోయిన కోటలను తిరిగి తన స్వాధీనము చేసికొనెను.

వల్లం దుర్గమును స్వాధీనము చేసికొన్నను, చొక్కనాథ నాయకుడు తంజావూరు విజయరాఘవరాయలతోడి వైరమును విస్మరించలేదు. ఇది యిట్లుండగా, విజయరాఘవరాయలు తన కుమార్తెను చొక్కనాథ నాయకునికి ఇచ్చి వివాహము చేయుటకు సమ్మతించలేదు. అందువలన ఉభయులకు యుద్ధము జరిగెనని కొన్ని చారిత్రక లేఖనములు పేర్కొనుచున్నవి. ఇదియే నిశ్చయముగా యుద్ధకారణమై ఉండవచ్చునని చెప్పుటకు వీలుపడదు. అయినను ఈ వివాహోదంతము కూడ యుద్ధకారణములలో ఒకటి అని నుడువదగును. సత్యాసత్యములు ఎంతవరకు కలవో తెలియదు కాని, యీ క్రింది కథ చారిత్రక లేఖనములలో కానవచ్చుచున్నది.[3]

విజయరాఘవనాయకుని కుమార్తెను చొక్కనాథ నాయకుడు వివాహమాడ దలచెను. ఆ అభిలాషను ఒక ప్రముఖుని ద్వారా విజయరాఘవ నాయకునికి తెలియజేసెను. కాని అతడు అ ప్రముఖుని పరాభవించుటయే కాక చొక్కనాథ నాయకుని కోరికను మన్నించలేదు. అందువలన చొక్కనాథ నాయకుడు తంజాపురాధీశ్వరునితో యుద్ధము చేయుటకు నిశ్చయించెను.

దళవాయి సముఖము వేంకటకృష్ణప్ప నాయకుని నాయకత్వమున మధుర సైన్యములు తంజావూరు దుర్గమును ముట్టడించెను. అప్పుడు అతడు విజయరాఘవ నాయకుని దర్శించి చొక్కనాథ నాయకునితో సంబంధము కలుపుకొనుట ఉభయులకు శ్రేయస్కరమని విన్నవించెను. కాని అతడు ఆ మాటలు పెడచెవిని పెట్టెను. తుదకు యుద్ధమే శరణ్యమయ్యెను. తంజావూరు పక్షమున దళవాయి రంగన్ననాయడు, వీరబాణం చిన్నరాజు మొదలైనవారు పాల్గొనిరి. మహా భయంకరముగా జరిగిన ఆ యుద్ధములో 'కొందరు చాలా గాయాలు తీస్కునినారు. కొందరు దప్పి తాలలేక క్రిందపడి పొర్లాడు

చున్న కాల్వలుగా వచ్చే రక్తాన్ని జలము అని భ్రమచేత పానం చేసి నారు[4]. ఉభయ పక్షముల వారికిని తీరని నష్టము కలిగెను. చివరికి తంజావూరు దుర్గము వేంకటకృష్ణప్ప నాయకుని వశమయ్యెను. అయి నప్పటికిని అతడు మరల విజయరాఘవనాయకుని సమీపించి చొక్క నాథ నాయకుని అభిలాషను తెలియజేసెను. అప్పుడు విజయరాఘవ నాయకుడు దైవధ్యానములో మునిగియుండెను. అతని కుమారుడు మన్నారుదాసు కూడ అతని చెంతనే ఉండెను. విజయరాఘవ నాయ కుడు చొక్కనాథ నాయకుని కోరికను మన్నించలేదు. మరల యుద్ధము జరిగెను. అందులో విజయరాఘవనాయకుడు, చెంగమల దాసు ప్రభృతులు మరణించిరి. అంతటితో తంజాపురాంధ్రనాయక రాజుల పరిపాలన అంత మయ్యెనని చెప్పవచ్చును.

విజయరాఘవ నాయకుడు చొక్కనాథ నాయకుని కోరికను మన్నింపకుండుటకు ప్రబల కారణ మొకటి కలదు. మధురనాయక రాజులు అభిజాత్యులు కారని అతని అభిప్రాయము. తంజావూరు నాయక రాజులలో మొదటివాడయిన చెవ్వప్పనాయకుడు విజయనగర సార్వభౌముడైన అచ్యుతదేవరాయలవారి తోడి అల్లుడు. మధురనాయక రాజులలో ప్రథముడగు విశ్వనాథనాయకుడు కొంతకాలము శ్రీకృష్ణ దేవరాయలవారి అడపముగా (తాంబూలకరండ వాహకుడు) వ్యవహ రించెను. కావున తంజావూరి రాజులు మధుర రాజ్యాధిపతులను కులీనులు కారను తలంపుతో చిన్నచూపు చూచుచుండిరి.

కాని మధుర, తంజావూరు పరిపాలకుల మధ్య వైవాహిక సంబంధములు లేకపోలేదు. తంజావూరు రఘునాథరాయలు మొదటి ముద్దువీరప్ప నాయకుని కుమార్తె అయిన కళావతిని వివాహమాడెను. రఘునాథరాయల కుమార్తె అయిన అచ్యుత రఘునాథమ్మను తిరుమల నాయకుడు పరిణయ మాడెను. ఆమెను అతడు హత్యచేసినట్లు అపప్రథ ఒకటి కలదు.

కనుక వివాహోదంతము కూడ మధుర తంజావూరు నాయక రాజుల యుద్ధమునకు కారణములలో ఒకటి అని చెప్పవచ్చును. వల్లం దుర్గమును స్వాధీనము చేసికొన్నను చొక్కనాథ నాయకునికి మన శ్శాంతి కలుగలేదన్నచో, అతనికి విజయరాఘవరాయలపై ద్వేష భావము ఉండుటకు అంతరంగికమైన కారణమేదో ఒకటి ఉండవలెను. శత్రురాజులు మధురమీదికి దండెత్తి వచ్చినప్పుడెల్ల, తంజావూరివారు శత్రుపక్షము వహించి మధుర రాజ్యాధిపతులను ప్రతిఘటించుచుండిరి. అప్పటిలో మైసూరువారివలన మధురకు చీటికిమాటికి ఉపద్రవములు కలుగుచుండెను. కనుక విజయరాఘవరాయలు మైసూరువారితో కలిసి తన్ను కూలద్రోయునేమో అని చొక్కనాథనాయకుడు సందేహించి ఉండవచ్చును. ఏమైనను, ఇదియే యుద్ధమునకు ప్రబల కారణ మని చెప్పలేము. కాని యివి అన్నియు యుద్ధకారణములై ఉండదగునని మాత్రము పేర్కొనవచ్చును.[5]

తంజావూరును జయించిన పిమ్మట చొక్కనాథనాయకుడు తన సవతి తమ్ముడగు ముద్దళగిరిని (ముద్దళగాద్రి) తంజావూరులో తన ప్రతినిధిగా నియమించెను.[6] ముద్దళగాద్రి 1674 వ సంవత్సరము నుండి తంజావూరి రాజ్యవ్యవహారములను పరిశీలింపసాగెను. అతడు మధురరాజ్య వ్యవహారములను కూడ పర్యవేక్షించుచుండెనని తెలియుచున్నది. ముద్దళగిరి సాహితీలోలుడని వాసి కెక్కెను.[7]

తొలుత ముద్దళగిరి నాయకుడు చొక్కనాథ నాయకునియందు వినయవిధేయతలు ప్రకటించుచు సంచరించ సాగెను. తంజావూరులో శాంతిభద్రతలు నెలకొల్పి రాజ్యవ్యవహారములను కట్టుదిట్టము చేసెను. కాని, కాలము గడచినకొద్ది ముద్దళగిరి నాయకునికి రాజ్యకాంక్ష ఉత్కటము కాగా సర్వస్వతంత్రునివలె సంచరించవలెనను ఆశ అతనికి పొడమెను. ఆ దురుద్దేశముతో అతడు చొక్కనాథనాయకుని!

చెల్లించవలసిన కప్పమును కూడ చెల్లించుటకు నిరాకరించెను. చివరకి తంజావూరి వ్యవహారములను ఎప్పటికప్పుడు తెలియజేయుట కూడ మానివైచెను. ఆ విధముగ, తన ఉనికి సుస్థిరము కాకమునుపే అతడు స్వతంత్రునివలె సంచరించసాగెను. ఈ విషయాదికమును తెలిసికొని చొక్కనాథనాయకుడు సోదరుని మందలించి చూచెను. అతడు త్రోవకు రాలేదు. అప్పుడు, విధిలేక, చొక్కనాథ నాయకుడు ముద్దళగిరితో యుద్ధము ప్రకటించెను. కాని మంత్రులు అతనిని వారించిరి.

ఇక తంజావూరి పరిస్థితులను గమనింతము. ముద్దళగిరి నాయకుని కొలువుకూటములో ఉన్న ప్రముఖులలో పేర్కొనదగినవాడు రాయసం వెంకన్న. అతడు మహా తంత్రజ్ఞుడు. తంజావూరి రాజ వంశీయులే తంజావూరి సింహాసనమును అధిష్ఠించవలెనని అతని అభిలాష. అందుకుతోడుగా విజయరాఘవనాయకుని పౌత్రుడయిన చెంగమలదాసు నాగపట్టణములో ఒక వర్తకుని యింటిలో పెరుగు చున్నట్లు తెలిసికొనెను. అతనిని సింహాసనమున ఉంచుటకు వెంకన్న నిశ్చయించెను. ఆ ఉద్దేశముతో అతడు బీజపూరు పాలకుని ఆశ్ర యించి ఆతని సహాయమును అర్థించెను. అందుకు అతడును సమ్మ తించెను. అ పనికి తన దండనాథుడయిన ఏకోజీని (వెంకాజీ) నియో గించెను. అప్పుడు గత్యంతరములేక ముద్దళగిరి నాయకుడు పశ్చా త్తప్తుడై వినయవిధేయతలు ప్రకటించుచు చొక్కనాథనాయకునికి లేఖ వ్రాసెను. 'పరరాష్ట్రకులు వచ్చి రాజ్యాన్ని ఆక్రమించుకొని పోతు న్నారు గనుక నేను చేసిన తప్పును క్షమించి తాము వచ్చి పరాయి వారిని నిగ్రహించి ఎప్పటియట్లు తమ రాజ్యం తాము కట్టుకొనేది" అని అతడు చొక్కనాథనాయకుని క్షమాభిక్ష వేడెను. కాని ఆ విపత్సమయ ములో అతడు తన తమ్మునికి సహాయము చేయ నిరాకరించెను. కాగా

ముద్దళగాద్రి నాయకుడు ఏకోజీతో యుద్ధము చేయలేక మైసూరుకు పారిపోయి అట తలదాచుకొనెను. తంజావూరును అనాయాసముగా వెంకన్న తన స్వాధీనము చేసుకొనెను. అటుపిమ్మట అతడు నాగపట్ట ణమునుండి చెంగమలదాసును రప్పించి అతనిని రాజుగా చేసెను. తనకు సహాయముగా ఉండిన ఏకోజీని గొప్పగా సన్మానించెను. అటుల చొక్కనాథనాయకుడు తంజావూరును కోల్పోయెను.

సింహాసనమునకు రాగానే చెంగమలదాసు తన్ను సాకిన దాది సలహా ననుసరించి ఆ నాగపట్టణ వర్తకుని ప్రధానమంత్రిగా నియ మించెను. అదినుండి ప్రధానమంత్రి పదవికి అంగలార్చుచుండిన వెంకన్నకు అది కోపకారణ మయ్యెను. తన్ను పరాభవించిన చెంగ మలదాసుని పదవీభ్రష్టునిగా చేయుటకు వెంకన్న నిశ్చయించెను. మరల ఏకోజీ సహాయమును కోరెను. ఏకోజీ తంజావూరును ముట్ట డించి, విజయము సాధించెను. రాజ్యభ్రష్టుడైన చెంగమలదాసు 8 చేయునదిలేక మరల నాగపట్టణమునకే పోయెను. ఏకోజీ విజయముతో తంజావూరిలో తెలుగువారి పరిపాలనకు భరతవాక్యము చెప్పబడెను; తంజావూరు మహారాష్ట్రుల వశ మయ్యెను.

ఏకోజి 9 తంజావూరి పాలకు డయ్యెను. కాని వెంకన్నకు మాత్రము ప్రధానామాత్య పదవి లభించలేదు. అతడు మహా తంత్రజ్ఞా డనియు, తలలు మార్చగల సమర్థుడనియు పసిగట్టిన ఏకోజి అతనిని హత మార్చుటకు నిశ్చయించెను. ఎటులనో ఆ విషయమును తెలిసికొని వెంకన్న తంజావూరు విడిచిపెట్టి, ఎచటికో పారిపోయెను.

ఇక నాయక రాజ్యములను కబళించవలెనని యత్నించిన మైసూరు పరిపాలకులను గమనింతము.

చొక్కనాథ నాయకుని సంతత సమరములు, మధుర, తంజా వూరు రాజుల నడుమగల రవరవలు మొదలైనవాటిని పురస్కరించు

కొని మైసూరు పాలకుడు దేవరాజ ఉడయరు మధురను ముట్టడింప దలచెను. కాని అతని అభిలాష నెరవేరుటకు మునుపే అతడు మరణిం చెను. అతని తరువాత చిక్కదేవరాయలు సింహాసనమునకు వచ్చెను. అతడు మహా ప్రతిభాశాలి. యుద్ధవీరుడుగానే కాక సంస్కృతాంధ్ర కర్ణాట భాషాపోషకుడుగా కూడ చిక్కదేవరాయలు యశోవిశాలు డయ్యెను తెలుగులో అతనికి సంబంధించిన చాటుధారలు చాల కలవు. వాటిని బట్టి చూడగా, చిక్కదేవరాయలు ఆ నాళ్ళలో విశేష విఖ్యాతి పొందిన పరిపాలకుడనియు, హాగలు గగ్గోలు రాయడనియు తెలియుచున్నది.

చిక్కదేవరాయల కాలములో మూడవ శ్రీరంగరాజు విజయ నగర సార్వభౌముడై ఉండెను. కోల్పోయిన రాజ్యభాగములను సంపాదింప దలచి, అతడు మధుర, తంజావూరు రాజులయు, ఇక్కేరి పాలకుడు శివప్ప నాయకునియు, దామెర్ల అయ్యాపేంద్రుడు10 అను దండనాథునియు సహకారమును పొంది చిక్కదేవరాయలతో యుద్ధము నకు దిగెను. ఈ రోడులో జరిగిన ఆ యుద్ధములో చిక్కదేవరాయలే జయించెను. శ్రీరంగరాజు ఇక్కేరికి పారిపోయెను. ఈ విజయముతో కీర్తియేకాక చిక్కదేవరాయలకు పలుకుబడియు కలిగెను. అటుపిమ్మట 1676 లో అతడు మధురకు చెందిన సత్యమంగలం రాష్ట్రము మీదికి దండెత్తిపోయి దానిని తనవశము చేసికొనెను. ఆ విధముగా, చొక్క నాథనాయకుని కాలములో సేలం,కోయంబత్తూరు జిల్లాలును తంజావూ రును భ్రష్టము లగుటచే మధుర నాయకరాజ్య పతనము అతని కాలమునుండి ప్రారంభ మయ్యెనని చెప్పవచ్చును.

తంజావూరులో ఏకోజి నిరంకుశుడై రాజ్యము చేయసాగెను. అతని పరిపాలన విధానమును నిరసించిన రఘునాథపంతు అను అతని మంత్రి ఏకోజి దుష్టపరిపాలనమును వివరించుచు శివాజీకి ఒక జాబు

వ్రాసెను. తత్ఫలితముగా దక్షిణాపథ వ్యవహారములను సమగ్ర ముగా తెలిసికొను ఉద్దేశముతో శాంతాజి అను సేనానిని శివాజి తంజావూరుకు పంపెను. అతడు దక్షిణాపథ వ్యవహార పర్యవేక్షకుడుగా నియమితు డయ్యెను. కాని వేకోజి శాంతాజిని కూడ లెక్కచేయ లేదు. తత్ఫలితముగా వా రిద్దరికి 1677 లో యుద్ధము జరిగెను. శాంతాజికి సహాయముగా ఆ యుద్ధములో శివాజి పాల్గొనెను. వేకోజి పరాజితు డయ్యెను. పిమ్మట శివాజీతో సంధి చేసుకొనెను. ఏటేట శివాజీకి మూడులక్షల రూప్యములు చెల్లించవలె ననునది సంధిషరతులలో ఒకటి. శాంతాజీతో వేకోజి యుద్ధముచేయు సందర్భమున తగిన తరుణము లభించెనను ఉద్దేశముతో చొక్కనాథ నాయకుడు ససైన్యముగా వెడలి తంజావూరును ప్రవేశించెను. కాని అంతలోనే వేకోజి సంధి చేసికొనుటచే విఫలమనోరథుడై చొక్కనాథ నాయకుడు మధురకు తిరిగి వచ్చెను.

చొక్కనాథ నాయకుని రాజ్యపరిపాలన సౌఖ్యావహముగా ఉండుననియు, శాంతిభద్రతలు ప్రసాదించుననియు తలచి మధుర ప్రజలు ఆతనిపై ఎన్నో ఆశలు పెట్టుకొని యుండిరి. కాని అతని నిరంతర యుద్ధములవలన మధురలో శాంతి సౌఖ్యములు కరవయ్యెను. ఆ యుద్ధములవలన సత్ఫలితములు కలిగియుండెనేని ప్రజలు కొంతవరకు సంతోషించి ఉండెడివారే; కాని అట్లు జరుగలేదు. పైపెచ్చు రాజ్యపటుత్వము కూడ తగ్గజొచ్చెను. యుద్ధవ్యయమును భరించుటకై ప్రభుత్వ కోశములోని ధన మంతయు వినియోగింపబడెను. కనుక క్రొత్తపన్నులు విధింపబడెను. ఆ పన్నుల భారము ప్రజలకు దుర్భర మయ్యెను. కాగా, రాజ్య భాగములనే కాక ప్రజానురాగమును కూడ కోల్పోయి చొక్కనాథ నాయకుడు రెంటికి చెడినరేవ డయ్యెను.

ప్రజాభిమానమునకు దూరమైపోయిన చొక్కనాథ నాయకుడు 1678 లో రాజ్యభ్రష్టు డయ్యెను. అతని తమ్ముడు ముద్దులింగనాయకుడు (ముద్దళగాద్రి) సింహాసనమునకు వచ్చెను. అతడు కడు దుర్బలుడు. అందువలన పరిపాలన సౌఖ్యప్రదముగా ఉండలేదు. దురదృష్టవశాత్తు ఆయేడు వైఘనదిలో వెల్లువలు రాగా, పలు గ్రామములు పాడయ్యెను. ప్రజలు పలుబాధలకు పాల్పడిరి. ఈ పరిస్థితులను పురస్కరించుకొని రుస్తుంఖాను అను సైనికోద్యోగి11 చొక్కనాథ నాయకుని మరల రాజుగా చేయుటకు ప్రయత్నించెను. ముద్దళగాద్రి నాయకునిచే దళవాయిగా నియమితుడైన రుస్తుంఖాను ముద్దళగాద్రిని సింహాసనమునుండి తొలగించి చొక్కనాథ నాయకుని రాజుగా చేసెను. ఆ కారణమున రుస్తుంఖానునకు విశేషాధికారము లభించెను.

రాజ్య వ్యవహారములను పరిశీలించుచుండిన రుస్తుంఖాను మలిన మనస్కుడై చొక్కనాథ నాయకుని కుటుంబ సమేతముగ నిర్బంధించె ననియు, అప్పుడు రామనాథపురమును పరిపాలించు కిళవన్ సేతుపతి సహాయమువలన చొక్కనాథ నాయకుడు స్వతంత్రుడయ్యెననియు తెలియుచున్నది. స్వామిద్రోహము తలపెట్టుటచే రుస్తుంఖాను ప్రజాసన్నుతిని కోల్పోయెను. అంతలో 1680 వ సంవత్సరమున మైసూరు పరిపాలకుడు మధురమీదికి దండెత్తి వచ్చెను. అప్పుడు రుస్తుంఖాను మధుర సైన్యములకు నాయకత్వము వహించి మైసూరు వారిని ప్రతిఘటించెను. అతడు వారితో పోరాడలేకపోయెను. కాగా దళవాయి గోవిందయ్య, కిళవన్ సేతుపతి, కొందరు పాళెగార్లు మున్నగువారు రుస్తుంఖాను వట్టి నిష్ప్రయోజకుడని తలచి అతనిని హతమార్చి చొక్కనాథ నాయకుని స్వతంత్రుని చేసిరి.

ఇక రామనాథపురములో రాజకీయముగా సంభవించిన పరిణామములను పరికింతము. 1674 లో తిరుమలనాయకునిచే గౌరవించబడిన

రఘునాథ సేతుపతి మరణించిన పిదప అతని మేనల్లుడు రాజసూర్య సేతుపతి సింహాసనమునకు వచ్చెను. అతడు చొక్కనాథ నాయకుని పట్ల అవిధేయుడై ప్రవర్తించెను. తంజావూరి యుద్ధములో అతడు చెంగమలదాసు పక్షము వహించెను. అందువలన అతనిని శిక్షింపదలచి చొక్కనాథ నాయకుడు దళవాయి సముఖము వేంకట కృష్ణప్ప నాయకుని రామనాథ పురమునకు పంపెను. వేంకట కృష్ణప్ప నాయకుడు సేతుపతిని బంధించి చెరసాలలో ఉంచెను. ఆ చెరసాలలోనే సేతుపతి హత్య కావింపబడెనట! రాజసూర్య సేతుపతి మరణానంతరము సింహాసనమునకు వారసు లెవ్వరును లేకపోయిరి. కనుక అతని జారపుత్రుడు రఘునాథ దేవుడు సింహాసనమునకు వచ్చెను. అప్పటికే అతడు ముసలివాడగుటచే అతనికి కిళవన్ (ముసలి) సేతుపతి అను వ్యవహారనామము కలిగెను.

కిళవన్ సేతుపతి రాజ్యపాలనము చాల ముఖ్య మయినది. వస్తుతః అతడు చాల తెలివికలవాడు; బలవంతుడును. సింహాసనమునకు రాగానే అతడు శత్రువుల నందరిని సంహరించి తన ఉనికిని సుస్థిరము చేసికొనెను. కాని చొక్కనాథ నాయకుని పట్ల ప్రగాఢమైన విశ్వాసము ప్రకటించెను. అంతేకాక విపత్సమయములలో అతనికి తోడునీడగా ఉండెను. తిరుమల నాయకునికి రఘునాథ సేతుపతి ఎటుల సహాయపడెనో, అటులనే పరరాజకేసరి బిరుదాంచితుడైన కిళవన్ సేతుపతి చొక్కనాథ నాయకునికి సహాయముగా ఉండెననుట సమంజసము.

ఇట్లుండగా మరొకమారు మైసూరువారితో చొక్కనాథ నాయకుడు యుద్ధము చేయవలసి వచ్చెను. మైసూరు దళవాయి కుమారయ్య తిరుచిరాపల్లి దుర్గమును ముట్టడించెను. అప్పుడు చొక్కనాథ నాయకుడు ఏకోజిని, జింజీలోని మహారాష్ట్ర దండనాథుడు అరశుమాలను12 ఆశ్ర

ఖుంచెను. అతనికి సహాయముగా వారు తమతమ సైన్యములను పంపిరి. అటులనే కిళవన్ సేతుపతియు తన సైన్యములను చొక్కనాథ నాయకునికి సహాయముగా పంపెను. ఆ సైన్యములను చూచినదే తడవుగా భయభ్రాంతుడై కుమారయ్య యుద్ధము విరమించి సంధి చేసికొన దలచెను. తన అభిలాషను కూడ వ్యక్త మొనర్చెను. కాని చొక్కనాథనాయకుడు అతనిని సందేహించి సదుత్తరము నొసగలేదు.

ప్రత్యుత్తరమునకై నిరీక్షించుచున్న కుమారయ్య అంతలో అరశు మాలను చొక్కనాథ నాయకుని పక్షమునుండి చీలదీయుటకు ప్రయత్నించెను. కాని అతని అభిలాష నెరవేరలేదు. ఎట్టయినను అరశు మాలను, ఏకోజిని యుద్ధమునుండి విరమింపజేయుటకుగాను కుమారయ్య కొంత సైన్యముతో వారిద్దరిని ప్రతిఘటించెను. చివరికి వారికి కుమారయ్య పట్టువడెను. ఈ విజయము అరశుమాలకు అఖండ ఖ్యాతిని సమకూర్చెను. పిదప అరశుమాల స్నేహధర్మమును విస్మరించి తిరుచిరాపల్లి దుర్గమును ముట్టడించెను.

చొక్కనాథ నాయకుడు పరమ దైవభక్తుడు. రాజ్య వ్యవహారములను తమ్ముడగు ముద్దళగిరి నాయకునికి వదలిపెట్టి అతడు భాగవత రామాయణాది సద్గ్రంథ కాలక్షేపము చేయుచుండెను. పరమత సహనము ప్రదర్శించిన విశాలహృదయుడు. అతని కాలమున క్రైస్తవ మతప్రచారకులు బాహాటముగా మతప్రచారము చేసికొనుచుండిరి. కాని కొందరు ప్రభుత్వోద్యోగులు మతప్రచారకులను బంధించినట్లు తెలియుచున్నది. యుద్ధ సమయములలోను, కరవు కాటకములలోను ప్రభుత్వోద్యోగులు మతప్రచారకులనే కాదు సామాన్య ప్రజలను సైతము బాధించుచుండిరి.

ఉపసంహారమున, చొక్కనాథనాయకుని పరిపాలన కాలము లోని తొలి భాగము ప్రశంసనీయ మనుట అసమంజసము కాదు. చిన్న వయస్సులో అతడు రాజ్యమునకు వచ్చుటచే ఉన్నతోద్యోగులు కొందరు అతనిని కూలద్రోయుటకు యత్నించిరి. కాని చొక్కనాథ నాయకుడు చాల మెలకువగా సంచరించిన కారణమున వారి ఆటలు సాగలేదు. తరువాత చొక్కనాథ నాయకుడు రాజ్యములో శాంతిభద్రతలు నెలకొల్పి ప్రజాసన్నుతిని చూరగొనెను. అందువలన అతని దొరతనము సౌఖ్యావహమై ఉండునని ప్రజలు తలచిరి. కాని దురదృష్టము! అందుకు భిన్న మయ్యెను. అతని రాజ్యపాలనము కన్నీటి గాథలకును అపజయములకును ఆలవాల మయ్యెను.

చొక్కనాథ నాయకుడు ప్రజాభిమానమును కోల్పోవుటకు అతని నిరంతర యుద్ధములే ప్రబల కారణ మనదగును. ఆ యుద్ధములవలన రాజ్యములో శాంతిభద్రతలు లోపించెను. కాగా, సమయము చిక్కినప్పుడెల్ల, స్వార్థపరులైన ప్రభుత్వోద్యోగులు ప్రజలను బాధలపాలు చేసిరి. అంతేకాక యుద్ధవ్యయమును భరించుటకై అదనపు పన్నుల మూలముగా ధనము సేకరించుట తప్పనిసరి అయ్యెను. యుద్ధముల వలన లాభములు కలిగియుండెనేని, అతడు ప్రజల అభిమానమును చూరగొని యుండెడివాడు. కాని, కొన్ని పట్టణములు చేయిజారి పోవుటవలనను, శత్రురాజుల ప్రాబల్యము ఎక్కువగుటవలనను అతనికి దుర్యశము మాత్రము దక్కినది. కాగా చొక్కనాథ నాయకుని చేతలన్నియు దోషములుగా పర్యవసించినవి. ఉదాహరణమునకు మహారాష్ట్రులు తంజావూరును ముట్టడించువేళ ముద్దళగిరి నాయకుడు చొక్కనాథ నాయకుని సహాయమును కోరెను. కాని అతడు సహాయము చేయ నిరాకరించెను. తుదకు మహారాష్ట్రులు తంజావూరిని తమ

స్వాధీనము చేసికొనిరి. వారి విజృంభణమును గుర్తించలేక, చొక్క నాథ నాయకుడు వారి సహకారమునే అర్థించెను. అట్లు అతడు ప్రవర్తించుటచే ఇరుగుపొరుగుల ఉన్న రాజులును, మహమ్మదీయులును దక్షిణాపథములో పలుకుబడి సంపాదించిరి. మధుర రాజ్యములోనూ శాంతిభద్రతలు నశించెను. ప్రజలూ దురవస్థల పాలయిరి. అంతేకాక అతని కాలములోనే మధుర నాయకరాజ్య పతనము ప్రారంభ మయ్యెను.

వస్తుతః చొక్కనాథ నాయకుడు సమర్థుడే అయినను, ఆ నాటి రాజకీయ పరిస్థితులకు అనుగుణముగా అతడు ప్రవర్తించలేక పోయెను. అతనిలో ధైర్యోత్సాహములు ఉన్నంతగా రాజనీతిజ్ఞత లేదేమో అనిపించును. తంజావూరు, జింజి పరిపాలకులతో పోల్చి చూచినప్పుడు చొక్కనాథనాయకుడు ప్రతిభాశాలి అనియే స్ఫురించును. కృష్ణస్వామి అయ్యంగారు పేర్కొనినట్లు, ఆ నాళ్ళలో అతనితో సరివచ్చువాడు చిక్కదేవరాయలు ఒక్కడే! ఏమైననేమి చొక్కనాథ నాయకుడు తల పెట్టిన పనులు లాభరహితములుగా పర్యవసించుటచే అతడు చిక్కదేవ రాయలు గడించినంత పేరు గడించలేక పోయెను.

23 సంవత్సరముల రాజ్యపరిపాలనానంతరము చొక్కనాథ నాయకుడు 1682 లో దైవికము చెందెను. పిమ్మట అతని కుమారుడు రంగకృష్ణ ముద్దువీరప్ప నాయకుడు సింహాసనమునకు వచ్చెను. అతనిని మూడవ ముద్దువీరప్ప నాయకుడని చరిత్రకారులు వ్యవహరింతురు.

---

1. "Shame, eternal shame to the Dutch, who cruelly speculated on the misery of the Indians! They enticed them to the coast by the bait of abundant food; then

when their number became pretty large ... ... transported them to other countries to be sold as slaves "

2. తంజావూరి విజయరాఘవ నాయకుడు సతతము దైవ ధ్యానమునందే విమగ్నుడై యుండెడివాడు. ఈ 'అతిదైవభక్తి' వలన అతడు తన ప్రజ లనుభవించు దురవస్థలను కూడ గ్రహించ లేక పోయెను.

3. తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర, మధురరాజైన తిరు మలరాయని చరిత్రము. ఈ వివాహోదంతము విశ్వసనీయమై ఉండవచ్చునని శ్రీ వి. రంగాచారి అభిప్రాయము. ఇండియన్ ఆంటిక్వరి, 1917, పుటలు 58-62.

4. మధురరాజైన తిరుమలరాయని చరిత్రము.

5. చొక్కనాథ, విజయరాఘవ నాయకులకు 1673 నో 1674 నో యుద్ధము జరిగెనని తెలియుచున్నది. యుద్ధకారణము మాత్రము ఇదమిత్థమని తెలియవచ్చుటలేదు. ఆదినుండి మధుర తంజావు రాంధ్రనాయక రాజుల నడుమ వైమనస్యము ఉండెను. అవి చొక్క నాథనాయకుని కాలమున పరాకాష్ఠనంది యుండనోపును. కాని 'The reign of Chokkanatha Naik from 1667 to nearly 1672 is practically without history ' అని శ్రీ సత్యనాథ అయ్యరు అభిప్రాయము.

6. 'సకలరాజ్య వ్యవహారము నంతను తమ్ముడైన ముద్దళ గాద్రి నాయన్ని విచారించుకొని రమ్మని రాజా చొక్కనాథనాయని

వారు భాగవత రామాయణ గ్రంధకాలక్షేపం చేస్తూ వున్నారు....

—మధురరాజైన తిరుమలరాయని చరిత్ర

7. గణపవరపు వేంకటకవి తన విద్యావతీ దండకమును ముద్దళగిరికి అంకిత మిచ్చెను. అతడు చొక్కనాథనాయకుని ప్రశంసించిన తీరు: "వీరాధివీర స్తుతోదార దోస్సారవ చొక్కనాథ క్షితీ శాగ్రణీ సోదరుం, డాశ్రితత్రాణ బద్ధాధరుం, డబ్ధి కన్యా సమానోల్ల సల్లింగమాంబా వధూగర్భశు క్తి న్మౌక్తికారుండై యెప్పు ముద్దళగిరిక్షోణిపాలుండు, సాహిత్యలోలుండు...."

Bulletin of the Govt Oriental Manuscripts Library, Madras, Vol. 1, No. 1, Pp. 89—102.

8. ఇతడు విజయరాఘవనాయకుని కుమారు డనియు, విజయరాఘవనాయకుని పౌత్రు డనియు, (మన్నారుదాసు కుమారుడు) చారిత్రకలేఖనములందు పేర్కొనబడినది. మరణించునాటికి విజయరాఘవనాయకుడు 80 సంవత్సరముల వృద్ధుడు. నాగపట్టణమునకు గొనిపోబడినపుడు చెంగమలదాసు వయస్సు రెండేండ్లని కొందరును, నాలుగేండ్లని కొందరును తలచుచున్నారు. కనుక ఇతడు విజయరాఘవ నాయకుని పౌత్రు డనుటయే ఉచితము.

9. ఇతడు శివాజి సహోదరుడు.

10. .... "వారి (దామెర్ల ముద్దువేంకటప్ప నాయనింవారు) తదనంతరం అయ్యప్పనాయనింవారు రావూరివారును జయ

ప్రద మైనందున నీజాపూరు పోయి అక్కడి కార్యాలు ఫత్తే చేసుకొని తిరుగ చిరునాపపల్లెకు వచ్చి ప్రభుత్వం చేస్తూవచ్చిరి. మరికొన్ని దినంబులకు మయిసూరివారిమీద యీరేటి (ఈరోడు) బారులో అయ్యపనాయనింవారు కంచిలడాయి యయిన వెనుక స్వర్గస్థులైరి."

—చాటుపద్యమణిమంజరి, ద్వితీయభాగము, పు. 342-43

11. మధురరాజైన తిరుమలరాయని చరిత్రలో ఇట్లున్నది. "....అప్పుడు ముద్దళగాద్రి నాయడు సకల రాజ్య తంత్రమును విచారించుతున్న తమవద్ద మహాపేదవాడుగా వచ్చిచేరి అనుసరించి యున్న రుస్తుంఖానును సరదారుగా నియమించినారు...." ఇతడు చొక్కనాథనాయకుని ఆశ్రితుడనియు తెలియుచున్నది.

12. జింజిని శివాజీ తనయుడగు శంభాజి పరిపాలించు చుండెను. అతని దండనాథుడే అరశుమాల.

# 10

# మూడవ ముద్దువీరప్ప నాయకుడు

## [1682–1689]

మూడవ ముద్దువీరప్ప నాయకుడు చొక్కనాథనాయకునికిని మంగమ్మకును జన్మించినవాడని కొందరును, కాదని కొందరును తలచుచున్నారు. 1687 లో వేయబడిన ఒక శాసనములో ముత్తమ్మ అను ఆమె ముద్దువీరప్పనాయకుని తల్లిగా పేర్కొనబడెను. మధుర ర్గాజైన తిరుమలరాయని చరిత్రలో ఈ విధముగా ఉన్నది. "చెంద్ర గిరి తుపాకుల లింగమనాయనివారి కుమార్తె మంగమ్మగారు మహా రూప యవ్వన కళాసమేతయై వుండే వర్తమానం విని శ్రీ రాజా చొక్కనాథ నాయనివారు తుపాకుల లింగమనాయనివార్కి తగు మను ష్యుల నంపించి ...మంగమ్మను వివాహము చేసుకునినారు".2

1674లో తంజావూరి విజయరాఘవనాయకుడు తన కుమార్తెను చొక్కనాథనాయకునికి ఒసగి వివాహము చేయుటకు నిరాకరించుట, తత్ఫలితముగా ఉభయులకు యుద్ధము జరుగుట — మొదలైన విషయ ములు సువిదితములే. ఆ తరువాత చొక్కనాథ నాయకుడు చంద్రగిరికి చెందిన తుపాకుల లింగమనాయని యొద్దకు తగు మనుష్యులను పంపి అతని కుమార్తె మంగమ్మను 1674–75 ప్రాంతమున పరిణయ మాడి

ఉండవచ్చును. కనుక 1682 లో సింహాసనమునకు వచ్చిన ముద్దు వీరప్పనాయకుడు అప్పటికి బాలుడై ఉండవలెను. ఎందుకనగా, మంగమ్మకును చొక్కనాథనాయకునికిని 1674–75 ప్రాంతమున వివాహము జరిగియున్నచో, ముద్దువీరప్పనాయకుడు 1675–76 ప్రాంతమున జన్మించెనని భావించవచ్చును. కావున రాజ్యమునకు వచ్చునాటికి అతడు ఏడేండ్ల బాలుడు. ఏడు సంవత్సరములు మాత్రమే రాజ్యము చేసి అతడు మరణించెను.[3] కాగా, అతడు పదునాలుగు సంవత్సరములు మాత్రమే జీవించినట్లు విశదమగుచున్నది. మరణించు నాటికి అతని భార్య ముద్దమ్మ గర్భవతి. కావున 1675-76 సంవత్సర ప్రాంతమున ముద్దువీరప్పనాయకుడు జన్మించెనని విశ్వసించినచో, అతడు పదునాలుగు సంవత్సరములకే పితృస్థానమును అలంకరించెనని చెప్పవలెను.

మంగమ్మతో చొక్కనాథనాయకునికి ఎప్పుడు వివాహము జరిగెనో[4] తేల్చి చెప్పుట కష్టమే అయినప్పటికిని, ముద్దువీరప్ప నాయకుడు మాత్రము మంగమ్మ కుమారుడని పేర్కొనదగును. ఆమెను గురించి రచింపబడిన ఒక గ్రంథములో ముద్దువీరప్ప నాయకుడు మంగమ్మ కుమారుడని కలదు.[5]

మూడవ ముద్దువీరప్ప నాయకుడు రాజ్యమునకు వచ్చునాటికి రాజకీయ పరిస్థితులు అతనికి చాల అనుకూలముగా ఉండెను. అందు వల్ల రాజ్యములో శాంతి భద్రతలు నెలకొల్పుట సులభ మయ్యెను. మైసూరు పరిపాలకుడు, తంజాపురాధీశ్వరుడు, రామనాథ పురాధిపతి మొదలైనవారు ఆ దినములలో ప్రబలులై ఉండిరి. కాని వారిలో వారికి ఐకమత్యము లేకపోవుటచే, ముద్దువీరప్పనాయకునికి శత్రుభయము లేకుండెను. శంభాజి నాయకత్వమున మహారాష్ట్రులు మైసూరు పాలకు

నితో యుద్ధము చేసి విజయము సాధించిరి. మైసూరునకు అపారమైన నష్టము కలిగెను. ఆ సందర్భమున మైసూరులోని కొన్ని గుళ్లు గోపురములు కూడ ధ్వంస మయ్యెనని తెలియుచున్నది.[6]

తంజావూరి పాలకుడు ఏకోజి కడు నిరంకుశుడై వ్యవహరించు చుండిన కారణమున అతడు ప్రజాభిమానమును కోల్పోయెను. సేతుపతులు తంజావూరు రాజ్య భాగములు కొన్నిటిని తమ వశము చేసికొనిరి. అందువల్ల ఏకోజివల్ల కూడ ముద్దువీరప్పనాయనికి భయము లేకుండెను. అటుల ఆ నాళ్ళలో ఇరుగు పొరుగు రాజులు పరస్పర వైషమ్యములకు లోనై ఉండుటచే, మధురలో శాంతిభద్రతలు సుస్థిరముగా నెలకొనుటకు అవకాశము కలిగెను. ముద్దువీరప్పనాయకుడు ప్రజాభిమానమును చూరగొనెను. ఈ కారణమున చాలకాలము పరిపాలింపకున్నను, అతడు మంచివాడనియు, గొప్పవాడనియు పేరు పెంపులు గడించెను.

ఇట్లుండగా రామనాథపురమును పాలించు కిళవన్ సేతుపతి స్వాతంత్ర్యము ప్రకటింపదలచి ముద్దువీరప్పనాయకుని ప్రతిఘటించుటకు నిశ్చయించెను. ఆ నిశ్చయముతో అతడు దళవాయి సముఖము వేంకటకృష్ణప్ప నాయకునితోను చెంగమలదాసుతోను రహస్యముగా మంతనములు ఆడదొడగెను. కాని సేతుపతి ప్రవర్తన అతని సైన్యాధ్యక్షుడు కుమారపిళ్ళకు నచ్చలేదు. కాగా సేతుపతిని, వేంకటకృష్ణప్ప నాయకుని బంధించి వారిని ముద్దువీరప్పనాయకుని సమక్షమున ఉంచుటకు యత్నించెను. ఈ సంగతి ఎట్లో సేతుపతికి తెలిసెను. కోపము కొలది కుమారపిళ్లను సేతుపతి హత్య చేసెను. అప్పటికి తృప్తిచెందక కుమారపిళ్ల వంశమును సమూలముగా నిర్మూలించెను. తర్వాత

సేతుపతికిని ముద్దువీరప్పనాయకునికిని యుద్ధము జరిగెను. సేతుపతికే జయము లభించెను.

తండ్రివలె ముద్దువీరప్పనాయకుడు కూడ పరమ దైవభక్తుడు. అతని కాలములో గుళ్లు గోపురములును, సత్రములు చావడులును పెక్కు వెలసెను. క్రైస్తవమత ప్రచారకులను ఆదరించి తన మత సహిష్ణుతను ప్రదర్శించెను. ముద్దువీరప్పనాయకుడు ఏకపత్నీవ్రతుడట! రాజకుటుంబములలో వారవనితాగమనము దోషముగా భావించబడని ఆ నాళ్లలో అతడు ఏకపత్నీవ్రతుడై ఉండుట ఎంతయు ప్రశంసార్హము. ఆ కాలపు రాజులు దక్షిణ నాయకులని పేరుమోసినవారు.

చారిత్రక లేఖనములలో ముద్దువీరప్ప నాయకునికి సంబంధించిన విచిత్రగాథ ఒకటి కనిపించుచున్నది. అతని కాలములో ఔరంగజేబు పాదుషా ఢిల్లీ నేలుచుండెను. పాదుషావారి సామంతులు కాని, స్వతంత్రపాలకులు కాని పాదుషావారి పాదరక్షలను ఆదరించవలెనట! ముద్దువీరప్పనాయకుడు రాజ్యాధికారము వహించు సమయమున ఔరంగజేబు తన పాదరక్షలలో ఒకదానిని మధురకు పంపించెనట. అస్వస్థత అను నెపముతో ముద్దువీరప్పనాయకుడు పాదరక్షను తీసికొని వచ్చిన ఆ సైనికులను ఆహ్వానించలేదు. వారే తిరుచిరాపల్లిని సమీపించినప్పుడును అతడు ఎదురేగి వారిని ఆహ్వానించలేదు. అయినను పాదుషావారి సైనికులే ఆ పాదరక్షను సింహాసనారూఢుడై ఉన్న ముద్దువీరప్పనాయకుని సమక్షమునకు తీసికొనిపోయిరి. అప్పుడు ఆ పాదరక్షను ముద్దువీరప్పనాయకుడు తన కాలికి తొడిగికొని మరొకటి కూడ కావలెనని అడిగెనట. పిమ్మట కోపోద్దీపితులైన ఆ సైనికులు సభాభవనము వెలుపల ప్రదర్శనలు చేయగా, వారిని ముద్దువీరప్ప నాయకుడు వధించెను. ఈ కథ నిజమో అబద్ధమో చెప్పలేము. ముద్దు

వీరప్పనాయకుని ప్రాభవమును తెలియజేయుటకు ఈ కథను కల్పించి రేమో.

1689 లో మశూచికము పోసి ముద్దువీరప్ప నాయకుడు అకాల మరణము చెందినట్లు తెలియుచున్నది. అప్పుడు అతని భార్య ముద్దమ్మ గర్భవతి. నాటి సాంఘికాచారమును అనుసరించి ఆమె సహగమనము సలుప నిశ్చయించెను. కాని మంగమ్మ ఆ ప్రయత్నమునుండి ఆమెను వారించెను. పిమ్మట ముద్దమ్మకు పురుషసంతానము కలిగెను; ఆత్మహత్య చేసికొని ఆమె అసువులు వీడెను. తర్వాత, ఆ శిశువునకు మూడవనెలలో విజయరంగ చొక్కనాథుడు అని పేరిడి మంగమ్మ అతనిని సింహాసనమును అధిష్ఠింపజేసెను. "విజయరంగ ముద్దు చొక్కనాథనాయనయ్య పసిబిడ్డగా వున్నందువల్ల ఆయన అవ్వ అయిన మంగమ్మగారు బిడ్డను ఒడిలో కూర్చుండబెట్టుకుని"[8] సంరక్షణకర్త్రిగా రాజ్యవ్యవహారములు పర్యవేక్షించసాగెను. ఆమె పరిపాలనము చారిత్రకముగా చాల ముఖ్యమైనదనుట నిర్వివాదము.

---

1. శ్రీరంగమునందలి శాసన మిది. శ్రీరంగకృష్ణ ముద్దు వీరప్ప నాయకుని తల్లియగు ముత్తమ్మ అను నామె శ్రీరంగనాథ స్వామికి రెండు గ్రామము లిచ్చినట్లు ఈ శాసనములో కలదు.

2. జెస్యూట్ మిషనరీల వ్రాతలలో కూడ దళవాయి లింగమ నాయకుడు మధుర రాజ్యాధిపతికి మామగారని పేర్కొన బడినది—

3. 9 సంవత్సరములు రాజ్యము చేసెనని కొందరి అభిప్రాయము.

4. జెస్యూట్ మిషనరీల వ్రాతలను పురస్కరించుకొని చొక్కనాథ నాయకుని వివాహము 1665 వ సంవత్సరమున జరిగి యుండనోపు ననియు, ముద్దువీరప్ప నాయకుడు 1666-7 సం॥ ప్రాంతమున జన్మించి యుండుననియు శ్రీ సత్యనాథ అయ్యరు విశ్వసించిరి. కనుక ముద్దువీరప్ప నాయకుడు సింహాపీఠి నలంకరించు నాటికి 15 సంవత్సరముల వయసువాడై ఉండును.

—History of the Nayaks of Madura పుట. 192

5. వికటకవి గోపాలరాయని 'మధుర మంగాపుంశ్చలీ లీలా విలాసము'న ఇట్లు కలదు.

"చొక్కనాథ మహీశుడు దా జచ్చిన
ప్రకటంబుగ నటుబలె దన కొడుకగు
రంగకృష్ణ ముద్దువీరాఖ్యు డీల్గిన...."

6. యుద్ధ వ్యయమును భరింపజాలక మైసూరు పరిపాలకుడు అదనపుపన్నులు కొన్ని వేసెను. అవి భరించలేక మైసూరు ప్రజలు తమ యేలికను ప్రతిఘటించిరట! అందుమీదట ఆ ప్రతిఘటనమును అణచివైచు తలంపుతో తిరుగుబాటుదారులను ఏ విధముగానైనను వధింపుడని సైనికులను మైసూరు పాలకుడు ఆజ్ఞాపించెను. వర్గవయో భేదములను కూడ పాటించక వారు తిరుగుబాటుదారులను వధింపదొడగిరి. అ సందర్భమున శివకేశవాలయములు కొన్ని ధ్వంసము చేయబడెననియు, ఆ ఆలయములలోని ధనధాన్యములు ప్రభుత్వ కోశాగారమునకు తరలింపబడెననియు తెలియుచున్నది.

7. బీజపూరు గోల్కొండలను స్వాధీనము చేసికొనిన పిదప ఔరంగజీబునెడల మైసూరు తంజావూరు పరిపాలకులు వినయ విధేయతలు ప్రకటించిరి. కాని ముద్దువీరప్పనాయకుడు మాత్రము పాదుషాకు లోబడక స్వతంత్రుడై వ్యవహరించి యుండవచ్చునని డాక్టర్ కృష్ణస్వామి అయ్యంగారు తలచిరి.

—History of the Nayaks of Madura ,పుట 198.

8. మదురై త్తలవరలాఱు.

# 11

# మంగమ్మ

## [1689–1706]

మంగమ్మ అధికారమునకు వచ్చునాటికి భారతావనిలో మొగలాయీ చక్రవర్తులు ప్రబలులై ఉండిరి. దక్షిణ భారతమును కూడ వారు స్వాధీనము చేసికొనిరి. మైసూరు పాలకుడు హగలు గగ్గోలు రాయడైన చిక్కదేవరాయలంతటివాడే ఔరంగజీబునకు సామంత నృపుడై వ్యవహరించసాగెను. తంజావూరి పాలకుడు శహాజి కూడ మొగలులకు సామంతు డయ్యెను. అందువల్ల గత్యంతరము లేక మంగమ్మ కూడ మొగలు సార్వభౌముల ఆధిపత్యమును శిరసా వహించెను. 1697 లో మొగలు సేనాధిపతి జుల్ఫిక్ఖాను దక్షిణాపథమునకు వచ్చినప్పుడు మంగమ్మ అతనిని ఘనముగా సత్కరించెను. మొగలు సైన్యముల సహాయముతో కోల్పోయిన కొన్ని రాజ్య భాగములను ఆమె సంపాదించెను.

మంగమ్మ కాలములోకూడ మైసూరివారివల్ల మధురకు యుద్ధ భీతి తప్పలేదు. 1695 లో చిక్కదేవరాయలచే అనుజ్ఞాతుడై దళవాయి కుమారయ్య సేలం, కోయంబత్తూరు జిల్లాలను ముట్టడించి స్థానికాధికారులను జయించెను. పిమ్మట అతడు తిరుచ్చిరాపల్లిని కూడ ముట్ట

డించుటకు ప్రయత్నించెను. తిరుచ్చిరాపల్లిని స్వాధీనము చేసికొనక మైసూరునకు మరల నని అతడు ప్రతిన చేసెనట; కాని మహా రాష్ట్రులు ఆ సమయమున మైసూరును ముట్టడించుటచే కుమారయ్య స్వదేశమునకు తిరిగిపోవలసి వచ్చెను. అందువల్ల మైసూరివారి బెడద తొలగెను.

తిరుమల నాయకుని కాలమునుండియు తిరువాంకూరు పాలకులు మధురనాయక రాజులయెడ వినయ విధేయతలు ప్రకటించి, వారికి కప్పము కట్టుచుండిరి. మూడవ ముద్దువీరప్ప నాయకుని కాలములో కూడ వారు విధేయులై ఉండిరి. కాని మంగమ్మ కాలములో తిరువాం కూరు పాలకుడు రవివర్మ కప్పము చెల్లించుటకు నిరాకరించెను కనుక యుద్ధము తప్పనిసరి అయ్యెను. మధుర సైన్యములు తిరువాం కూరు మీదికి దండెత్తిపోయి రవివర్మవద్దనుండి కప్పము వసూలు చేసెను. అటుల ప్రతి సంవత్సరము మంగమ్మ తిరువాంకూరు పరి పాలకునినుండి కప్పము రాబట్టుకొనుచుండెను. రవివర్మ దుర్బలు డగుటవల్లను, అతని ఎనమండుగురు మంత్రులును అతనిని ప్రతిఘ టించుచుండుటవల్లను, అతడు మధుర సైనికులను ప్రతిఘటింపజాలక పోయెను. ఇట్లుండగా, 1696 లో మధుర సైన్యములు యథాప్రకార ముగా తిరువాంకూరు ముఖ్యపట్టణమైన కోర్కుళము[1] వరకు వెళ్లెను. అప్పుడు రవివర్మ ఒక యుక్తి పన్నెను. తన ఎనమండుగురు మంత్రు లను కనుక హతమార్చినచో వారికి తన రాజ్యములో కొంత భాగ మిచ్చెదనని మధురకు ఆశ చూపెను. వారు రవివర్మ మంత్రులు కొందరిని సంహరించిరి. కొందరు పారిపోయిరి. అటు పిమ్మట రవివర్మ సైన్యములు అకస్మాత్తుగా మధుర సైన్యముల మీద పడెను. ఆ సందర్భ మున పలువురు మరణించినట్లు తెలియుచున్నది.

రవివర్మను లొంగదీసికొను తలంపుతో 1697 లో మంగమ్మ అతనితో యుద్ధము ప్రకటించెను. దళవాయి నరసప్పయ్య నాయకత్వమున మధుర సైన్యములు తిరువాంకూరునకు ప్రయాణ మయ్యెను. నరసప్పయ్య కోర్కుళమును ముట్టడించెను. ఘోరయుద్ధము జరిగెను. తర్వాత కోర్కుళము అతని వశమయ్యెను. అంతేకాక నరసప్పయ్య రవివర్మవద్దనుండి కప్పముతోపాటు అమూల్యాభరణములు కూడ గ్రహించెను.

తిరువాంకూరు యుద్ధము ముగిసిన మూడు సంవత్సరములకు— అనగా 1700 లో—తంజావూరు పాలకుడు శహాజి మధుర రాజ్యము మీదికి దండెత్తివచ్చి కొన్ని పట్టణములను స్వాధీనము చేసికొనెను. అందువల్ల మంగమ్మ శహాజీతో యుద్ధము ప్రకటించెను. దళవాయి నరసప్పయ్య నాయకత్వము వహించెను. ఉభయ పక్షములవారును కాలరూన్ నదికి ఇరువైపుల విడిసిరి. నరసప్పయ్య ధైర్యముచేసి, సైన్య సమేతముగా నదిని సురక్షితముగా దాటి తంజావూరు రాజ్యమును ప్రవేశించెను. అతని సాహసమును చూచి తంజావూరు సేనలు ఆశ్చర్యముచెంది తమ రాజ్యమును కూడ సంరక్షించుకొనుటను మాని నదిని దాటి మధురరాజ్యమును ప్రవేశింప నిశ్చయించెను. కాని నదిని దాటుటకు వారు నిర్ణయించుకొన్న చోటు సరియైనది కాదు. అంతేకాక అప్పుడు నదిలో వెల్లువ పారుచుండెను. అందువల్ల నదిని దాటునప్పుడు తంజావూరు సైనికులు పలువురు నదీప్రవాహములో పడి కొట్టుకొని పోయిరి. ఎన్నో గుర్రములు కూడ కొట్టుకొని పోయెను. అట్టి విపత్సమయములో నరసప్పయ్య తంజావూరి సేనలపై పడి, వారిని జయించెను.

నరసప్పయ్య విజయ వృత్తాంతమును విన్న శహాజి భయాక్రాంతుడయ్యెను. తన అపజయమునకు కారణము తన ప్రధానా

మాత్యుడైన బాలోజిపంతు కుతంత్రమై ఉండవచ్చునని తలచి అతనిని శిక్షింపదలచెను. అప్పుడు బాలోజిపంతు నరసప్పయ్యతో సంధిచేసికొని వత్తుననియు, లేకున్న తన్ను శిక్షింపవచ్చుననియు శహాజీతో నుడివి, సంధిప్రయత్నములకు కడంగెను. మూడు నాలుగు రోజులలో అతడు 5,00,000 రూప్యములు సేకరించి మధుర మంత్రులకును నరసప్పయ్య తండ్రికిని లంచము లిచ్చి కార్యము సాధించెను. కాని అచిరకాలము లోనే ఒక విచిత్ర సంఘటన మూలముగా మధుర, తంజావూరు వారి మధ్య మిత్రత నెలకొనెను.

మైసూరు చిక్కదేవరాయలు కావేరి నదీజలములను తన దేశమునకు మరల్చుకొనదలచి, అతడు కావేరిపై ఆనకట్ట ఒకటి కట్టెను. ఆ నిర్మాణమువల్ల మధుర, తంజావూరులకు జలాభావము కలుగుటచే మంగమ్మయు శహాజీయు చిక్కదేవరాయలను ప్రతిఘటించవలెనను ఉద్దేశముతో యుద్ధప్రయత్నములు చేయసాగిరి. అంతలో వానలు విరివిగా కురిసెను. కావేరిలో వెల్లువలు వచ్చెను. తత్ఫలితముగా ఆ ఆనకట్ట ధ్వంసమయ్యెను. పిమ్మట మధుర తంజావూరు పాలకులు తమ యుద్ధప్రయత్నములు విరమించుకొనిరి.

ఇట్లుండగా, 1698 లో కిళవన్ సేతుపతి మధురమీదికి దండెత్తి వచ్చెను. కాని దళవాయి నరసప్పయ్య ప్రదర్శించిన ధైర్యసాహసముల ఫలితముగా సేతుపతికి జయము లభించలేదు. మరల 1702 లో సేతుపతి మధురమీదికి దండెత్తివచ్చెను. తంజావురాధిపతి మధురకు సహాయముగా ఆ యుద్ధములో పాల్గొనెను. పలుమారులు వైరివీరుల నుండి మధురను సంరక్షించిన నరసప్పయ్య నాయకత్వమున మధుర సైన్యములు సేతుపతిని ప్రతిఘటించెను. యుద్ధము ముగియకమునుపే నరసప్పయ్య దైవికము చెందెను. కాగా అంతిమ విజయము సేతుపతికే లభించెను. ఈ విజయముతో సేతుపతి మధురపాలకులతోగల

సంబంధమును తెగ త్రెంపులు చేసికొనెను. పిమ్మట రామనాథపురము స్వతంత్ర రాజ్యమని కిళవన్ సేతుపతి ప్రకటించెను. నాటినుండియు అతని పలుకుబడి దక్షిణాపథమున ఎక్కువయ్యెను. రామనాథపురము చుట్టుప్రక్కల ఉన్న కొన్ని పట్టణములను స్వాధీనము చేసికొని అతడు తన రాజ్యమును విస్తృతపరిచెను. 1709 లో అతడు తంజావూరు సైన్యములతో పోరాడి జయము సాధించినట్లు తెలియుచున్నది.

మంగమ్మకు అపజయము లభించినది ఒక్క సేతుపతితో చేసిన యుద్ధములోనే. దళవాయి నరసప్పయ్య జీవించియున్నంతవరకు ఆమె అపజయమును ఎరుగదు. ఒక వైపు మొగలుచక్రవర్తులును, మరొక వైపు మైసూరు పాలకుడును, ఇంకొకవైపు తంజావురాధీశ్వరుడును, వేరొకవైపు తిరువాంకూరు పాలకుడును మధురను కబళించుటకు యత్నించిరి. కాని ఆమె ప్రదర్శించిన సమయస్ఫూర్తి, రాజనీతిజ్ఞత మొదలైనవి శత్రువుల ఆటలను కట్టివేసెను. లేకున్నచో, రాణి మీనాక్షి కాలములోకాక (1732—36) రాణి మంగమ్మ కాలములోనే మధుర నాయక రాజ్యము పతనమై ఉండెడిది.

రాజకీయముగా మంగమ్మ గడించిన చిరయశస్సు ఒక యెత్తు; అమె చేసిన దానధర్మములవల్లను ప్రదర్శించిన మతసహనము వల్లను గడించిన శాశ్వతయశస్సు ఒక యెత్తు. ఆమె గడించిన రాజకీయ విజయములు కాలగర్భములో కలిసిపోయినను, ఆమె కావించిన దాన ధర్మములు నేటికిని చెక్కుచెదరక ఆమె కీర్తిని వేనోళ్ళ చాటుచున్నవి. మధురనాయక రాజులందరివలె మంగమ్మ కూడ మత సహిష్ణుత ప్రదర్శించిన విశాలహృదయ. దేవాలయములకు విరివిగా దానధర్మ ములు చేసినట్లే, ఆమె మహమ్మదీయ, క్రైస్తవ దేవాలయములకు దాన ధర్మములు చేసెను.

మంగమ్మ మతసహనమును అధారము చేసికొని క్రైస్తవమత ప్రచారకులు స్వేచ్ఛగా తమ మతమును గురించి ప్రచారము చేసికొన సాగిరి. మహమ్మదీయులు కూడ ఆమె ఆదరాభిమానములకు పాత్రులై యుండిరి. 1692, 1701 సంవత్సరములలో ఆమె కొన్ని మసీదులకు దానధర్మములు చేసినట్లు శాసనములు సాక్ష్య మిచ్చుచున్నవి. ఆ విధముగా మతసహిష్ణుతను ప్రదర్శించుచు మంగమ్మ రాజ్యము చేయుచున్న కాలములో రామనాథపురములో ఒక విచిత్ర సంఘటన జరిగెను.

కిళవన్ సేతుపతి దగ్గరి బంధువులలో ఒకడు క్రైస్తవ మతమును స్వీకరించెనట! అతడే సేతుపతికి తరువాత రాజ్యమునకు వారసుడు. కనుక అతడు మతాంతరుడగుట ప్రజలకు దుర్భర మనిపించెను. క్రైస్తవమతప్రచారకుల వలన మున్ముందు మరెట్టి అరిష్టములు కలుగునో అని తలచి మరవలు క్రైస్తవబోధకులను బాధింపసాగిరి.[3]

ఇక మంగమ్మ దేవాలయములకు కావించిన దానధర్మములును, ప్రజోపయోగార్థము వెలయించిన సప్త సంతానములును అనేకములు. మధుర మీనాక్షి గుడికిని, ఉత్తమపాలెములోని ఈశ్వరాలయమునకును దానములు ఎక్కువగా చేసినట్లు తెలియుచున్నది. చోళవందము అనుచోట మంగమ్మ ఒక గొప్ప సత్రమును నిర్మించి, దానికి కొంత భూమి కూడ వ్రాసియిచ్చెను. అటులనే శివలూరు, తడంపట్టి మొదలైన ప్రదేశములలోను సత్రములు చావడులు అనేకములు నిర్మించెను. ఎన్నో బాటలు వేయించెను; తటాక కూపములు వెలయించెను. మంగమ్మ కట్టించిన కొన్ని భవనములలో నేడు ప్రభుత్వ కార్యాలయములు పనిచేయుచున్నవి. మధుర రైల్వేస్టేషను ఎదురుగా ఉన్న సత్రము నేటికిని మంగమ్మ పేరుమీదనే వ్యవహృతమగుచున్నది.

ఇటుల దక్షిణాపథములో సర్వేసర్వత్రా మంగమ్మపేరు మారుమోగు చుండుట ఎంతయు సంతసింపదగిన విషయము. ఆమె వదాన్యతను తెలియజేయుచున్న రుచికరములైన కథలు ఎన్నో బహుళప్రచారములో కలవు. వాటిలో ఈ క్రిందిది ఒకటి.

'విశేష విఖ్యాతి గడించిన మైసూరు చిక్కదేవరాయలు ప్రతి రోజు ధనాగారములో కొంత ధనము భద్రముచేసిన తర్వాతనే మరొక పని చూచెడివాడట! మరణానంతరము అతనికి నరకము ప్రాప్తించెను. ఇట్లుండగా, ఒకనాడు యమభటులు ఒకనిని తీసికొనివచ్చుటకు బదులుగా పొరపాటున మరొకనిని భూలోకమునుండి నరకలోకమునకు తీసికొని వెళ్ళిరి. అతడు మైసూరు పౌరుడు. చేసిన పొరపాటును గుర్తించిన ఆ భటులు అతనిని మైసూరుకు పంప నిశ్చయించిరి. అప్పుడు చిక్కదేవరాయలు నరకములో తాను పలుబాధలు పడుచుంటిననియు, అచిరకాలములోనే మధురనేలు మంగమ్మ మరణించు ననియు, ఆమె దాన నిరతిని వేనోళ్ళ కొనియాడుచున్న దేవలోక వాసులు ఆమెను ఘనముగా సత్కరించనున్నారనియు ఆ మైసూరు పౌరునికి చెప్పెను. మైసూరునకు తిరిగి వచ్చిన తర్వాత అతడు అన్ని విషయములు చిక్కదేవరాయలవారి కుమారునికి తెలియజేసెను. తదాదిగా అతడు దానధర్మములు విరివిగా చేసి చిక్కదేవరాయలకు స్వర్లోకప్రాప్తి అగునట్లు చేసెను.'

ఈ కథ కేవలము కల్పిత మనుట స్పష్టము.

మంగమ్మ దానశీలమును, చిక్కదేవరాయల లౌభ్యమును తెలియజేయు తలంపుతో ఎవరో యీ కథను కల్పించియుందురు. ఇది కట్టుకతయే అయినప్పటికిని, ఆనాటి తెలుగువారల ఉదార హృదయమును తెలియజేయుచున్నది. మూర్తీభవించిన వదాన్యత యే మంగమ్మ !

మంగమ్మ గుణగణములలో పేర్కొనదగినది ఆమె సంఘ సంస్కరణాభిలాష. మూఢ విశ్వాసములకును పూర్వాచారములకును పట్టుగొమ్మగా ఉన్న ఆనాళ్ళలో మంగమ్మ సంఘమును ప్రతిఘటించెనన్నచో, ఆమె మహాసాహసురాలనియు, పూర్వాచారములందు కొంత వైముఖ్యము ప్రదర్శించిన స్త్రీ అనియు నుడువవలసియున్నది.

ఆ రోజులలో రాజకుటుంబములలో సహగమనము పరిపాటి. తంజావూరి విజయరాఘవరాయల మరణానంతరము తంజావూరి అంతఃపుర స్త్రీలందరు చితి పేర్చుకొని మరణించిరి. తిరుమలశౌరి నాయకుడు దైవికము చెందగా, అతని భార్యలు రెండువందలమంది సహగమనము చేసిరట. అటులనే కిళవన్ సేతుపతి మరణానంతరము అతని నలుబది యేడుగురు భార్యలు సహగమనము చేసిరి. కనుక చొక్కనాథనాయకుని మరణమునకు పిదప సహగమనము చేయక మంగమ్మ రాజ్యము కూడ చేసె నన్నచో, ఆమె సాహసురాలని స్పష్ట మగుచున్నది. పైగా, కోడలు ముద్దమ్మ సహగమనమునకు సన్నద్ధురాలు కాగా, మంగమ్మ ఆమెను వారించెను.

ఈ చారిత్రక విషయములేకాక జనసామాన్యము నేటికిని చెప్పుకొనుచున్న యీ క్రింది కథ మంగమ్మ సంఘ సంస్కార ప్రయత్నమును వ్యక్తము చేయుచున్నది.

మధురానగరములో పట్టునూలు కరణులు అను చేనేత పారిశ్రామికు లుండిరి. వారు సదాచారప్రియులు. వారి ఆచారములు చాలవరకు బ్రాహ్మణుల ఆచార వ్యవహారములను తలపించుచుండును. బ్రాహ్మణులవలె వారును ఉపాకర్మాది వేదోక్తకర్మలు ఆచరించుచుండిరి. ఆ విషయమును తెలిసికొనిన మధురానగరాధికారి వారిని శిక్షింపదలచెనట. పట్టునూలు కరణులు అధికారిని గురించి

మంగమ్మకు విన్నవించుకొనిరి. వారికి ఉపాకర్మాధికారము కలదో లేదో తెలిసికొనుటకై ఆమె పండిత పరిషత్తు నేర్పాటు చేసెను. ఆ విద్వన్మండలి పట్టునూలుకరణుల పక్షము తీర్పుచెప్పెను. అటుపిమ్మట పరిషత్తు నిర్ణయమును వ్రాయించి ఆ పత్రమును మంగమ్మ పట్టునూలు కరణులకు ఇచ్చెను.

ఇంతవరకు మంగమ్మ రాజకీయ జీవితమును, సంఘ సంస్కార ప్రియత్వమును పరిశీలించితిమి. ఆమె వ్యక్తిగత జీవితమును కనుక పరిశీలించినచో, ఆమె కలుషిత శీల అని తెలియవచ్చును. ఆమె స్త్రీ మాత్రగా తోచదు. నీతినియమములు లేని స్త్రీగా తోచును.

వికటకవి గోపాలరాయడను కవి 1650-1700 సంవత్సర ప్రాంతముల తంజావూరు, మధుర, ఆనెగొంది మొదలైన రాజ్యము లలో జరుగుచుండిన ఘోరములు, అసత్యప్రవర్తనములు మొదలైన వాటిని వర్ణించుచు ఒక రచన చేసెను. దానిపేరు మధురమంగా పుంశ్చలీ లీలా విలాసము. రచన చేసినంతకాలము గోపాలరాయడు తద్రచన పాపపరిహారార్థము శ్రీరామ మంత్రమును జపించుచుండె నట. ఈ గ్రంథములోని విషయాదికమును గ్రహించుటకు పై వాక్యము ఒక్కటే చాలును. శిల్పాచార్యులను, నటవిట గాయకు లను ఆదరించిన మంగమ్మ కవులను ఎందుకో అంతగా ఆదరించి నట్లుగా తెలియవచ్చుట లేదు.

మంగమ్మకు కోడెకాండ్రు కొందరు ఉండిరట. వారిలో నరసయ్య (దళవాయి నరసప్పయ్య అగునేమో), రంగయ్య, అచ్చయ్య (మంత్రులలో ఒకడు), మీనాక్షయ్య మొదలైనవారు ముఖ్యులు. మధురమంగాపుంశ్చలీ లీలా విలాసము మధుర నేలిన మంగమ్మకు గాక మధురలోని మంగ అను ఒక వేశ్యకు సంబంధించిన దను సంశయ మొకటి కలదు. ఇదియే కనుక నిజమైనచో, మంగమ్మ

అన్ని విషయములలోను సాటిలేని రాణి అని నుడువదగును. కాని ఆమె మరణ వృత్తాంతము కూడ కొంతవరకు ఆమె దుశ్శీలమును బలపరుచుచున్నది.

మంగమ్మకు మనుమడు విజయరంగ చొక్కనాథనాయకుడు పెద్దవాడైన పిదప అతడే స్వయముగా రాజ్యవ్యవహారములను పరిశీలింపసాగెను. మంత్రి అచ్చయ్యకును మంగమ్మకును సంబంధ మున్నట్లు తెలిసికొని అతడు ఆమెను ఆమె నివసించు భవనమునందే నిర్బంధించినట్లు తెలియుచున్నది. చివరికి ఆ మహారాణికి గుప్పెడు మెతుకులు కూడ కరవయ్యెనట. అన్నము లేక కృశించిపోయి మధుర నేలిన మంగమ్మ కడపట మరణించెను.4

మంగమ్మ వ్యక్తిగత జీవితమును విడనాడి విశాలదృష్టితో ఆమె రాజకీయముగా సాధించిన విజయములను, సంఘ సంక్షేమ దృష్టితో చేసిన సత్కార్యములను, ప్రదర్శించిన మత సహనమును కనుక పరిశీలించిన ఆమె సాటిలేని రాణి అని విదిత మగును. ఏది యెట్లున్నను, నేటికిని ఆమె ఆదరపూర్వకముగా స్మరింపబడుట కొనియాడ దగిన విషయము !

---

1. ఇది నేటి కొయ్‌లాన్ కావచ్చును.

2. 1692 వ సం॥ న వేయబడిన తామ్రశాసనములో మంగమ్మ మనుమడగు విజయరంగ చొక్కనాథ నాయకుని పేరు కనబడుచుండుటచే అతని పేరుమీదుగా ఆమె దానధర్మములు చేసె నని నుడువదగును. ఈ శాసనము తెలుగులో ఉన్నది.

1701 వ సం॥ న వేయబడిన శాసనములో తిరుచిరాపల్లికి సమీపమున ఉన్న కొన్ని గ్రామములను మహమ్మదీయుల

'దరగా' కు మంగమ్మ దానము చేసినట్లు చెప్పబడినది. ఇది కూడ తెలుగులోనే ఉన్నది. మంగమ్మ వేయించిన శాసనములు చాల వరకు తెలుగులోనే ఉన్నవి. గమనింపదగిన విషయ మిది.

3. కిళవన్ సేతుపతి కాలమున జాన్ డి బ్రిట్టో అను పాదిరీ మఱవదేశమున క్రైస్తవమతప్రచారకుడై ఉండెను. అతని నిరంతర కృషి వలన మఱవలు పలువురు క్రైస్తవము స్వీకరించిరి. కిళవన్ సేతుపతి కోపమునకు గురియైన అతడు తుదకు హత్య గావింపబడెను. కాని కిళవన్ సేతుపతి తన జీవిత చరమ భాగమున క్రైస్తవుల నాదరించెనని తెలియుచున్నది.

—History of the Nayaks of Madura, p. 216.

4. మంగమ్మ దుర్మరణమును సమర్థించు ప్రబలాధారములు లేకపోవుటవలనను, మరణించు నాటి కామె యేబదియేండ్లు పైబడిన వృద్ధ అగుటవలనను, ఆ వయసున ఆమెకు అచ్చయ్యతో సంబంధ ముండియుండుట పొసగదనియు, కావున ఆమె దుర్మరణము చెంద లేదనియు శ్రీ సత్యనాథ అయ్యరు అభిప్రాయము.

—History of the Nayaks of Madura, p. 221.

12

# విజయరంగ చొక్కనాథ నాయకుడు

## [ 1706 – 1732 ]

1706 నుండి విజయరంగ చొక్కనాథ నాయకుడు రాజ్య వ్యవహారములను స్వయముగా పరిశీలింపసాగెను. మహాదైవభక్తు డగుటచే అతడు సదా దైవధ్యానమునందును, తీర్థయాత్రాచరణము నందును నిమగ్నుడై యుండెడివాడు. దేవస్థానములకు సంబంధించిన వ్యవహారములను మాత్రము తన పర్యవేక్షణలో ఉంచుకొని మిగిలిన రాజ్యవ్యవహారములను మంత్రులకు వదలివేసెను. ఆ అవకాశమును పురస్కరించుకొని కుటిలమతులైన ప్రభుత్వోద్యోగులు ప్రజలను బాధింపసాగిరి. అందువలన విజయరంగ చొక్కనాథ నాయకుని పరిపాలన లోపభూయిష్ఠమగుటయేకాక మధురనాయకరాజ్య పతనము నకును దారి తీసెను.

విజయరంగ చొక్కనాథ నాయకుని కాలములో కస్తూరి రంగయ్య దళవాయిగాను, వేంకట కృష్ణయ్య ప్రధానామాత్యుడుగాను ఉన్నట్లు తెలియుచున్నది. కఠినాత్ములైన వా రిద్దరు క్రొత్తపన్నులను మిషతో ప్రజల ధనమును దోచుకొనిరి. ప్రభువునకు తెలియజేయకయే వారు పన్నులు విధించుచుండిరి. అవసరమైనచో ప్రజలను కడగండ్ల

పాలు చేయుటకును వారు సాహసించు చుండిరి. 1710 లో వేయ బడిన ఒక శాసనములో పన్నుల భారమును భరించలేక ఒక ఆలయ భృత్యుడు గుడిగోపురము నుండి క్రిందికి దూకి మరణించినట్లు పేర్కొన బడినది. గోరుచుట్టుపై రోకటిపోటు అన్నట్లుగా, ఆ రోజులలో-1710 నుండి 1720 దాకా—గొప్పక్షామ మొకటి విలయతాండవము చేసెను. కనుక విజయరంగ చొక్కనాథ నాయకుడు ప్రజాభిమానమునకు దూర మయ్యెను.

ఇట్లుండగా 1710 లో పరరాజకేసరి బిరుదాంకితుడైన కిళవన్ సేతుపతి మరణించెను. అతని తరువాత విజయరఘునాథ సేతుపతి సింహాసనమునకు వచ్చెను. అతడు కిళవన్ సేతుపతి రెండవ కుమారుడని తెలియుచున్నది. తన అనంతరము భవానీ శంకర దేవుడు (వేశ్యాపుత్రుడు) సేతుపతి కావలెనని కిళవన్ సేతుపతి ఆశించెను. అందువలన మరవ రాజ్యములో రెండు పక్షములు ఏర్పడెను.

మరవ రాజ్యమును వశము చేసికొను తలంపుతో భవానీ శంకరదేవుడు పుదుకోట్టై, తంజావూరు పరిపాలకులను ఆశ్ర యించెను. వారి సహాయముతో అతడు విజయరఘునాథ సేతుపతితో యుద్ధము ప్రకటించెను. యుద్ధము జరుగుచున్న కాలములో సేతుపతి మరణించెను. కాని మరణాత్పూర్వమే తాండదేవుడు అను నొకనిని అతడు సేతుపతిగా నియమించెను. చివరికి ప్రజల సహకారముతో భవానీ శంకరదేవుడు సేతుపతి అయ్యెను. కాగా, తాండదేవుడు సేతుపతితో యుద్ధమునకు దిగదలచి విజయరంగ చొక్కనాథ నాయకుని సహాయమును కోరెను. అందుకు అతడు సమ్మతించెను; కొంత సైన్యమును సహాయముగా పంపించెను.

భవానీ శంకరదేవుడు తంజావూరు పాలకుని సహాయముతో తాండదేవుని ప్రతిఘటించెను. తాండదేవుడు, అతని అనుచరులును చాలమంది ఆ యుద్ధములో మరణించిరి. కాని భవానీ శంకరదేవుని పరిపాలన చాలకాలము కొనసాగలేదు. 1729 లో జరిగిన ఉరయూరు యుద్ధములో అతడు అపజయము పొందుటయే కాక తంజావూరి సైన్యములకు పట్టుబడెను కూడ. తత్ఫలితముగా మరవ రాజ్యము లోని కొంత భాగము తంజావూరునకు సంక్రమించెను. కనుక విజయరంగ చొక్కనాథుని కాలములో తంజావూరి పాలకుడు ప్రబలుడై ఉండెనని చెప్పవచ్చును.

విజయరంగ చొక్కనాథ నాయకుడు పెక్కు గుళ్లుగోపురముల కును మఠములకును విరివిగా దాన ధర్మములు చేసెను. దాన ధర్మ ముల క్రింద అతని ధనాగారము చాలవరకు వినియోగింపబడెనని పేర్కొనవచ్చును. రెండు సంవత్సరములకు ఒకసారి విజయరంగ చొక్కనాథ నాయకుడు సపరివారముగా శ్రీరంగము, జంబుకేశ్వ రము, మధుర, తిరునల్వేలి, ఆళ్వార్ తిరునగరి, శ్రీవైకుంఠము మొద లైన దివ్యస్థలములు సందర్శించెడివాడు.1 తంజావూరి విజయరాఘవ నాయకునివలె, విజయరంగ చొక్కనాథ నాయకుడును అతి దైవభక్తి ప్రదర్శించి రాజ్యవ్యవహారములలో శ్రద్ధ చూపలేదు. అందుకు తోడుగా, అతని అసమర్థతయు, మంత్రుల దుష్పరిపాలనమును2 రాజ్య పతనమునకు దారి తీసెను. ఉపసంహారమున, తెలుగుభాషా పోషకు డనియు, సాహిత్యలోలుడనియు నుడువకున్న విజయరంగ చొక్క నాథ నాయకుని చరిత్ర సమగ్రము కాజాలదు.

26 సంవత్సరముల పరిపాలనానంతరము విజయరంగ చొక్కనాథ నాయకుడు 1732 లో దైవికము చెందెను. అనపత్యు

డగుటచే, అతనికి పిమ్మట అతని భార్య మీనాక్షి రాజ్యమునకు వచ్చెను.

---

1. ఆలయములను సందర్శించునపుడెల్ల విజయరంగ చొక్కనాథనాయకుడు ఆయా దైవతములకు అమూల్యాభరణములు మొదలగువానివి సమర్పించెడివాడు. అవి అన్నియు అపహృతములైనట్లు తెలిసికొన్నను, విచారణ చేయకయే మరల నగలూ నాణెములూ సమర్పించుచుండెనట.

2. నరవప్పయ్య, వేంకటరాఘవాచార్యులు అనువారు మంత్రులుగా ఉండిరి. పన్నుల మూలముగా లభించిన ద్రవ్యమును వారు దుర్వినియోగము చేయుచుండినట్లు తెలియుచున్నది.

# 13

# మీనాక్షి

## [1732 – 1736]

సహజముగా మీనాక్షి దయార్ద్రహృదయ; కల్లకపటము లెరుగని సచ్ఛీల; ధర్మదృష్టికల సామ్రాజ్ఞి. తన సోదరుడగు వేంకట పెరుమాళ్ళనాయకుని సహాయముతో ఆమె రాజ్యము చేయసాగెను. అతని అభిమతమును అనుసరించి తమ బంధుకోటిలోని వాడయిన బంగారు తిరుమల నాయకుని కుమారుడు విజయకుమారుని దత్తత చేసికొనెను. అందుకు ప్రజలు కూడ సంతోషించిరి. కాని ఆ దత్తత జరిగిన నాటి నుండియు మధుర రాజ్యములో అప్రశాంతత ఏర్పడెను. అందుకు శాశ్వత ఫలితమో అన్నట్లుగా, మూడుపువ్వు లారుకాయలుగా వర్ధిల్లిన మధురనాయక రాజ్యము అంతరించెను. అనగా, తమిళ నాడులో తెలుగువారి దొరతనమునకు భరతవాక్యము చెప్పబడె నన్న మాట!

రాణి మీనాక్షి విజయకుమారుని పెంచుకొనిన నాటినుండి రాజ్యాధికారమును తన హస్తగతము చేసికొనవలెనను దురాశ బంగారు తిరుమల నాయకునికి కలిగెను. కాని రాణియు వేంకట

పెరుమాళ్ల నాయకుడును అతనిని ఒక కంట కనిపెట్టియే యుండిరి. అందువలన రాజ్యవ్యవహారములలో పాల్గొను అవకాశము బంగారు తిరుమల నాయకునికి కలుగలేదు. తత్ఫలితముగా రాణిపై పగ సాధింప దలచెను. చివరికి దళవాయి వేంకటాచార్యుని తన వలలో వేసికొని రాణిని కూలద్రోయుటకు నిశ్చయించెను బంగారు తిరుమల నాయకుడు. రాజ్యములో రెండు పక్షములు ఏర్పడెను. పేరుగల మన్త్రులు కొందరు రాణి పక్షము వహించిరి; కొందరు బంగారు తిరుమలనాయకుని పక్షము చేరిరి. దురదృష్టము, రాజ్యక్షేమము విస్మరింపబడెను; బలాబలాలు తేల్చుకొనుటయే ధ్యేయ మయ్యెను.

అట్టి పరిస్థితిలో, 1734 వ సంవత్సరమున, ఆర్కాటుని రాజధానిగా చేసికొని కర్ణాటకమును పాలించు చుండిన దోస్తుఆలీ మధుర రాజ్యమును కబళింప దలచెను. ఆ భారమును కుమారుడు సఫ్దర్ ఆలీ, అల్లుడు చందా సాహెబులపై వేసెను.

శత్రుదుర్భేద్యమయిన తిరుచిరాపల్లి దుర్గమును చూచినదే తడవుగా విజయసాధన కలలోని మాటగా సఫ్దర్ ఆలీ భావించెను. పైపెచ్చు ప్రజలు కూడ రాణి పక్షము వహించియుండిరి. కాని రాజ్యములోని కలుషిత వాతావరణము అతని అభీష్టసిద్ధికి తోడ్పడెను.

బంగారు తిరుమలనాయకుడు సఫ్దర్ ఆలీని ఆశ్రయించెను. లంచమిచ్చి అతనిని లోబరుచుకొనెను. పిమ్మట మధ్యవర్తిగా నటించుచు సఫ్దర్ ఆలీ రాణితో సంప్రదింపులు మొదలుపెట్టెను. అతని మధ్యవర్తిత్వమును ఆమె సంశయించెను; అతని మాటలను సరకు సేయలేదు. ఆ విషయమును గ్రహించి అతడు ఖిన్నుడయ్యెను. మధుర రాజ్యము బంగారు తిరుమలనాయకునికే సంక్రమింపవలెనని చెప్పి, అతడు ఆర్కాటునకు మరలిపోయెను. పోవునప్పుడు అతడు

బంగారు తిరుమలనాయకునికి తోడునీడగా ఉండుమని చందా సాహెబును కోరెను.

చందాసాహెబు వలన తనకు ఎట్టి ప్రమాదము వాటిల్లునో అని భయపడిన రాణి తనకు అపకారము తలపెట్టవలదని అతనిని కోరెను. అందుకు సమ్మతించిన, కొంత ద్రవ్యము కూడ ఇచ్చెదనని ఆమె ఆశ చూపెను. అప్పుడు చందాసాహెబు కోటి రూప్యములు అడిగెను. అంతద్రవ్యము ఇచ్చుటకు రాణి తొలుత తటపటాయించెను. కాని కడపట కోటిరూప్యము లొసగి అతని సహాయమును పొందుటకే ఆమె నిశ్చయించుకొనెను. అయినను, ఎందుకోగాని అతనిపై రాణికి గట్టి నమ్మకము కుదురలేదు. అతడు తంత్రజ్ఞుడు. రాణికి అపకారము తలపెట్టననియు, ఆమెకే సహాయము చేయుదుననియు అతడు కురాను మీద ప్రమాణము చేసెనట. ప్రతిరోజు అతడు శ్రద్ధాభక్తులతో కురాను పఠించెడివాడు! అందువలన అతనిని రాణి నమ్మెను. అంతేకాని అతడు కుటిలోపాయము పన్నెనని మాత్రము ఆమె గ్రహించలేకపోయెను. కురాను గ్రంథాకృతిని తలపించునట్లుగా ఇటుకలు పేర్చి వాటిని కనులపండువు గొలుపు చీనాంబరమున చుట్టి దానిమీద చందాసాహెబు ప్రమాణము చేసెను.1

రాణియు చందాసాహెబు రాజీపడిరను వార్త చెవినిపడగానే బంగారు తిరుమలనాయకుడు భయభ్రాంతుడయ్యెను. తనవలన తన కుమారునకు ముప్పు వాటిల్లునేమో అనియు అతడు భయపడెను. రాణితో రాజీపడుటయే శ్రేయస్కరమని తలచెను. కాగా, తాను చేసిన తప్పులను విస్మరించి తన్ను క్షమింపుమని బంగారు తిరుమలనాయకుడు రాణిని కోరెను. అతడు నిజముగానే పశ్చాత్తప్తుడయ్యెనని తలచి, సహజముగా అనుకంపాచిత్త అయిన మీనాక్షి అతనిని క్షమించెను. విజయకుమారుడు తనయొద్ద ఉన్నచో అతనికి ఏమైన ముప్పు

కలుగునేమో అని సందేహించి, అతనిని దిండుగల్లు దుర్గమునకు పంపి వైచెను. బంగారు తిరుమలనాయకుడు దిండుగల్లు దుర్గాధిపతిగా నియమితు డయ్యెను.

ఈ విషయాదికము చందాసాహెబునకు విచారహేతువయ్యెను. అతని ఆశాసౌధములు కూలిపోయెను. రాణి యిచ్చిన సొమ్ముకంటెను బంగారు తిరుమలనాయకుడు ఎక్కువ ఇచ్చుననియు, అప్పుడు అతని పక్షము వహించి రాణిని హతమార్చి మధురరాజ్యమును హస్తగతము చేసికొనవచ్చుననియు అతడు తలచెను. ఇక తిరుచిరాపల్లిలో ఉండుట వలన లాభము లేదనుకొని అతడు ఆర్కాటునకు మరలిపోయెను.

కాని చందాసాహెబు మనస్సు మాత్రము మహైశ్వర్యముతో తులదూగు మధురమీదనే ఉండెను. మధుర కనుక తన స్వాధీనమైనచో తానును ఒక నవాబువలె స్వతంత్రుడై ఉండవచ్చునుగదా అని అతని ఆశ. కాగా, అతడు 1736 లో సైన్యసమేతుడై మరల తిరుచిరాపల్లికి వచ్చెను. ఊతూరి కోటలోనే తిష్ఠ వేసెను. రాణికి అతనిమీద అంత నమ్మకము కుదిరెను !

కోటలో ప్రవేశించినది మొదలు చందాసాహెబు రాణిని కూలద్రోయుటకే ఎత్తులు వేయసాగెను. ఆమెకు తనపై అణుమాత్రమైనను అపనమ్మకము కలుగని విధముగా అతడు అప్రమత్తుడై సంచరింపసాగెను. ఆమె ఆదరాభిమానములు చూరగొనుటకుగాను, ఆమెపై పగబూనిన శత్రువులను అతడు సంహరించెను. అంతటితో ఆగక అతడు రాజ్యవ్యవహారములలోను పాల్గొన సాగెను. పరిపాలన చందాసాహెబు చేతిమీదుగా సాగిపోవుచుండెను. అప్పటికిని అతని దుస్తంత్రములను రాణి గ్రహింపలేకపోయెను. అంతకంతకును అతనిపై ఆమెకు నమ్మకము అగ్గలము కాదొడగెను.

తన ఉనికిని సుస్థిరము చేసికొనిన తరువాత మధుర సైన్యముల సహాయముతో చందాసాహెబు బంగారు తిరుమల నాయకుని అధీనములో ఉన్న దిండుగల్లు దుర్గమును స్వాధీనము చేసికొన దలచెను. ఆ కార్యభారమును గోవిందయ్య, రావణయ్య అను దండనాథులమీద వేసెను. దళవాయి గోవిందయ్య నాయకత్వమున 80,000 అశ్వికదళమును సైనికులును దిండుగల్లుకోటను ముట్టడించిరి. ఆ హఠాత్ సంఘటన బంగారు తిరుమలనాయకునికి భయ విస్మయములు కలిగించెను. రాణి తనపై అకారణ శత్రుత్వము వహించినందుకు అతడు మిక్కిలి పరితపించెను. పైగా అప్పుడు అతడు యుద్ధముచేయు స్థితిలోలేడు. అందువలన గోవిందయ్యను ప్రతిఘటింపలేక బంగారు తిరుమలనాయకుడు కోటను వీడి పారిపోయెను. దిండుగల్లుకోట సులభముగా గోవిందయ్య వశమయ్యెను. అనంతరము మధుర దుర్గమును కూడ అతడు వశము చేసికొనెను.

అప్పటికి చందాసాహెబు మాయోపాయములు తిరుచిరాపల్లి దుర్గములో ప్రాకజొచ్చెను. కొందరు పాళెగాండ్లు బంగారు తిరుమల నాయకుని పక్షము వహించి దళవాయి గోవిందయ్యను అమ్మయ నాయకనూరు అను చోట ప్రతిఘటించిరి. ఉభయపక్షములకును యుద్ధము జరిగెను. గోవిందయ్యకే జయము లభించెను. అందువలన బంగారు తిరుమలనాయకుడు శివగంగకు వెడలి అట తలదాచుకొనెను. కాని ఆర్కాటు నవాబు ఉద్యోగులు అతనిని వధించినట్లు తెలియుచున్నది.

దళవాయి గోవిందయ్య విజయములను ఎప్పటికప్పుడు వార్తాహరుల మూలమున తెలిసికొనుచుండిన చందాసాహెబు చివరికి రాణిని పరిమార్చుటకు ప్రయత్నించెను. ఆ మలినభావముతో ఆమెను

కోటలోనే బంధించెను. అప్పటికిగాని అతని మాయోపాయములు రాణికి తెలియలేదు. కాని పరిస్థితులు తనచెయ్యి దాటిపోయెను. తుదకు నిర్బంధము నుండి బయటపడుటకును దారి కనిపించలేదు.

అటుపిమ్మట చందాసాహెబు నిర్భయముగా రాణి మీనాక్షి అంతఃపురమును ప్రవేశించెను. పరపురుషుడు-అందులోను నమ్మించి ద్రోహము చేసిన కుటిలుడు—చందాసాహెబు చేతికి చిక్కి మరణించు టకు ఆ మానవతికి మనస్కరించలేదు. జీవితముపై రోత ఏర్పడెను. కాగా తన వజ్రపుటుంగరములోని వజ్రమును వెలికి తీసి, పగులగొట్టి, ఆ పొడిని నీటిలో కలిపి, దానిని త్రాగి మధుర నేలిన రాణి మీనాక్షి దుర్మరణము చెందెను.

మధురనాయకరాజుల వంశీయులు మధురకు దగ్గరలో ఉన్న వెళ్ళికుర్చిచ్చి, బోడినాయకనూరు, తేక్కన్‌పట్టి మొదలగు గ్రామము లలో నేటికిని నివసించుచున్నట్లు తెలియుచున్నది.[2]

తంజాపురాంధ్ర నాయకరాజ్యము మహారాష్ట్రుల వశమై నట్లుగా, మధురనాయకరాజ్యము మహమ్మదీయుల పరమయ్యెను. అటుల మధుర తంజాపురాంధ్ర రాజ్యములు రెండును తెలుగువారి చేతుల నుండి దాటిపోయెను. కాని ఉదారస్వభావులు, కళాహృదయు లును అయిన ఆ తెలుగు దొరలు త్రవ్వించిన తటాకకూపములు, నిర్మించిన సత్రములు చావడులు, కట్టించిన కోటల శిథిలాకృతులు, వెలయించిన గుళ్లు గోపురములు, సంతరించిన సుందర భవనములు మొదలైనవి నాయకరాజుల సౌహార్దమునకు వన్నెచిన్నెలు కైసేయు చున్నవి. విజయనగరాధీశ్వరులకు పిమ్మట, దక్షిణాపథములో హిందూమతమును తత్ సంస్కృతిని సంరక్షించినవారు కూడ

ఈ నాయకరాజులే. తెలుగులను తమిళులను సరిసమానముగా ఆదరించి భాషా సహనము ప్రదర్శించిన విశాలహృదయులు నాయకరాజులు. అన్యమతములను కూడ ఆదరించి మతసహనము ప్రదర్శించిన మహనీయులు మధురనాయకరాజులు!

---

1 మదరాసునుండి వెలువడుచుండిన 'సౌభాగ్య'లో శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ 'మీనాక్షి' అను ప్రశస్త వ్యాసమును ప్రకటించిరి.

2 మదురై నాయక్కర్ వరలాఱు, పుట 364.

# 14

# మధురనాయకరాజుల కాలపు రాజకీయ సాంఘిక పరిస్థితులు

రమారమి 210 సంవత్సరములు మధుర రాజ్యమును పరిపాలించిన నాయకరాజులు వస్తుతః ధర్మమార్గావలంబకులు; దయార్ద్ర హృదయులు, దాన వినోదులును. మత సహనమును ప్రదర్శించిన విశాలహృదయులు. కళాపోషకులు. ప్రజోపయోగార్థము సప్తసంతానములు వెలయించిన సరసులు.

మధురనాయకరాజులలో ఆరుహన్నిబ్బరగండ బిరుదపరాజితుడైన విశ్వనాథ నాయకుడు ప్రథముడు. అతడు విజయనగర సమ్రాట్టుల ప్రతినిధిగా రాజ్యము చేసినను, తిరుమల నాయకుడును అతనికి తరువాత రాజ్యమునకు వచ్చిన వారును సంపూర్ణ స్వాతంత్ర్యము వహించిన విషయమును విస్మరించరాదు. మొదట మధురానగరము రాజధానిగా ఉండెడిది. పిమ్మట తిరుచిరాపల్లి (త్రిశిరపురము) రాజధాని అయ్యెను.

తొలుత విశ్వనాథ నాయకుడు మధురకు వచ్చినప్పుడు ఆ నగరము పూజాపురస్కారములు లేక బూజుపట్టిన ఆలయమువలె ఉండెను. పాండ్యమండల మంతయు చిట్టడవులతో నిండి యుండుటచే

వన్యమృగములు ఎచ్చట చూచినను విచ్చలవిడిగా తిరుగుచుండెను చోరభయము ఎక్కువగా ఉండెను. దుర్గములు శిథిలావస్థలో ఉండెను. దేవాలయములు కళావిహీనములై ఉండెను. రాజ్యములో శాంతి భద్రతలు స్వప్నగత వృత్తాంతములై ఉండెను. తుదకు మధురానగరము కూడ దుస్థితిలో ఉండెను. కావున మధురను పునరుద్ధరించు అభిలాషతో తన దళవాయి ప్రధాని అరియనాథ మొదలితోను, దళవాయి బిసపాకము కేశవప్పనాయనితోను సంప్రదించి విశ్వనాథనాయకుడా నగర దుర్గమును పునర్నిర్మించెను. అది ముగిసిన పిమ్మట విశ్వనాథనాయకుడు మీనాక్షీ సుందరేశ్వరులకు కన్నుల పండువు గొలుపు కోవెలలు కట్టించెను. ప్రజలకు తోడ్పడు కార్యనిర్వహణములందు తన తండ్రి నాగమనాయకు డార్జించిన ద్రవ్యమును కూడ అతడు వినియోగించెను. అతడట్టి త్యాగవీరుడు! కనుకనే విశ్వనాథనాయకుడు దానశీలుడనియు, ప్రజారంజక పరిపాలకు డనియు పేరు పెంపులు గడించెను. అతని యేలుబడిలో పాండ్య మండలము సర్వవిధముల వృద్ధికి వచ్చెననుట నిస్సంశయము.

ఆనాళ్ళలో దక్షిణాపథమున పలుతావులందు చిట్టడవులు పెరిగియుండెను. అందువలన దుష్టమృగముల వలని భయ మధికముగా ఉండెను. పలుగ్రామములు జనశూన్యములై ఉండెను. వ్యవసాయ సదుపాయములు లేకపోవుటచే మధురరాజ్యము చాల భాగము బీడువారి యుండెను. ఆ పరిస్థితులకు తోడుగా చోరభయము ఎక్కువగా ఉండుటచే ఆ కాలపు ప్రజలు పలుబాధలకు పాల్పడుచుండిరనుట నిర్వివాదము. కనుకనే విశ్వనాథనాయకుడు మధురను పునరుద్ధరించుటకు పూర్వము చిట్టడవులను ఛేదించియు, దుష్టమృగములను తునుమాడియు, ప్రయాణికులకు రక్షణ కల్పించియు, బంజరు భూములలో వ్యవసాయము ప్రారంభించియు అతడు ప్రజల ఆదరాభిమానములను చూరగొనెను.

తిరుమలనాయకుని కాలములో కూడ దుష్టమృగముల భయ మధికముగా ఉన్నట్లును, వ్యాఘ్రములను సంహరించినవానికి అతడు గొప్ప బహుమాన మొసగినట్లును ఒక శాసనము స్పష్టము చేయు చున్నది. 1662 వ సంవత్సరమున ఒక పాదిరీ వ్రాసిన లేఖలో మధురానగర పరిసరములందు పులులు, తోడేళ్లు మున్నగు వన్య మృగములు సంచరించుచుండెనని పేర్కొనబడినది. కనుక పాండ్య మండలమున శాంతి భద్రతలను సుస్థిర మొనర్చిన విఖ్యాతి నాయక రాజులకు లభించినది.

మధురనేలిన నాయకవంశీయులలో పేర్కొనదగిన వారు విశ్వ నాథనాయకుడు, తిరుమలనాయకుడు, మంగమ్మ ప్రభృతులు. కడమ నాయకరాజులు నామకః పరిపాలకులే కాని రాజ్యభారమును వారి మంత్రులే నిర్వహించిరి. విజయరంగ చొక్కనాథ నాయకుని వంటి వారు రాజ్యవ్యవహారముల యందు విముఖత వహించి సతతము తీర్థయాత్రాచరణమునందే నిమగ్నులై యుండిరి. దేవస్థానములకు సంబంధించిన వ్యవహారములను మాత్రమే అతడు పర్యవేక్షించెడి వాడు. కడమ వ్యవహారములను మంత్రులే పరిశీలించుచుండిరి. ఆ అవకాశమును పురస్కరించుకొని దురాశాపూరితులైన ప్రభుత్వో ద్యోగులు కొందరు ప్రజలను బాధించి వారి అసంతృప్తికి పాల్పడిరి.

విజయరంగ చొక్కనాథ నాయకుని కాలములో కస్తూరి రంగయ్య దళవాయిగాను, వేంకటకృష్ణయ్య ప్రధానిగాను ఉండినట్లు తెలియుచున్నది. కఠినచిత్తులైన వారిద్దరును ప్రభువునకు తెలియకుండ గనే క్రొత్తపన్నులు విధించి, వసూలు చేయుచుండిరి.

పన్నుల భారమును భరించలేక ఒక ఆలయభృత్యుడు విధించిన పన్నులకు నిరసన సూచనగా గుడిగోపురము మీది నుండి క్రిందికి

దూకి ప్రాణము వీడెనట! ఈ పన్నులభారమునకు తోడుగా కరవు కాటకములు తరచుగా సంభవించుచుండెను. యుద్ధసమయములందు శత్రువీరులు కలకలలాడు బంగారు పంటలను నాశ మొనర్చుచుండిరి. గ్రామములను ధ్వంసము చేయుచుండిరి. అట్టి విషమ విపత్కర పరిస్థితులందు ప్రజలు పలుబాధలకు పాల్పడుచుండిరని వేరుగా నుడువ నవసరము లేదు.

ఒక్క మధుర రాజ్యమునందేకాదు ఇట్టి దురవస్థలకు ప్రజలు పాల్పడినది! ఆ నాళ్ళలో దక్షిణ భారతములోని మైసూరు, తంజ పురాది రాజ్యములందును ప్రజలు పలుబాధలకు లోనయిరి. యుద్ధ వ్యయమును భరింపజాలక మైసూరు పరిపాలకు డొకడు తన రాజ్యము నందు పన్నుల నెక్కువ చేసెను. తత్ఫలితముగా మైసూరిప్రజ లతనిని ప్రతిఘటించుటకును సన్నద్ధులయిరి. ఆ ప్రతిఘటనము నణచి వైచుటకు కృతనిశ్చయుడై తిరుగుబాటుదారుల నెట్లయినను సరే వధింపుడని మైసూరుపాలకుడు సైనికుల కాజ్ఞ యొసగెను. వర్ణవయోభేదములను కూడ పాటించక వారు కనబడిన వారి నందరను తమ కరవాలము లకు నైవేద్యముగా సమర్పించిరట. ఆ సమయమునందు కొన్ని శివ కేశవాలయములు కూడ ధ్వంసము కావింపబడెననియు, ఆ ఆలయము లందలి ధనధాన్యములు ప్రభుత్వకోశాగారమునకు తరలింపబడెననియు తెలియవచ్చుచున్నది.

చొక్కనాథ నాయకుని కాలముననే బీజపూరు సుల్తాను సైని కులు తిరుచిరాపల్లి దుర్గమును ముట్టడించుటకు విశ్వప్రయత్నము చేసిరి. కాని ఆ దుర్గరాజము వారి వశము కాలేదు. అప్పుడు విఫల మనోరథులైన ఆ సైనికులు తిరుచిరాపల్లి పరిసరముల నున్న పంట చేలమీద పడి వాటిని సర్వనాశనము చేసిరి. గ్రామములను దగ్ధ

మొనర్చిరి. శత్రుసేనల పైశాచిక చర్యలను చూడలేక మానధనులగు ప్రజలు గుంపులు గుంపులుగా గృహములందు చేరి ఆ యిండ్లకు నిప్పు పెట్టుకొని దుర్మరణము చెందిరి ఏదో ఒక విధముగా బలవన్మరణము నకు పాల్పడుటకు వా రభిలషించిరట!

యుద్ధసమయములందు పల్లెపట్టులలో నివసించు ప్రజలే ఆ విధముగా ఇడుమలు పడుచుండిరనగా యుద్ధరంగములందు శత్రు వీరులను మార్కొను సైనికవీరుల అవస్థలు ఆ సర్వసాక్షికే తెలియ వలెను.

మధురనాయక రాజుల చరిత్రను పరిశీలింపగా మన కీ విషయము తెలియవచ్చును. రాజు బలహీనుడైనప్పుడును, అతడు రాజ్యమునం దాసక్తి లేనివాడగునపుడును, రాజ్యవ్యవహారములు మంత్రులు మున్నగు ఉన్నతోద్యోగుల అధీనములో ఉన్నప్పుడును, యుద్ధ సమయములందును ప్రజలు పలుబాధలకు లోనగుచుండిరి. యుద్ధ వ్యయమును భరించుటకుగాను పాలకులు పన్నుల నెక్కువ చేయు టయు, తన్మూలముగా పాలితులు బాధావహులగుటయు జరుగు చుండెను.

నాయక రాజులలో విశ్వనాథనాయకుడు, తిరుమలనాయకుడు, మంగమ్మ మున్నగువారు పేర్కొనదగినవారు. తిరుమలనాయకుని అపూర్వ సృష్టియైన తిరుమలనాయకుని మహలు ప్రాచ్యపాశ్చాత్య కళాభిజ్ఞుల ఆదరాభిమానములు చూరగొనినది. నిజమునకు అది కమనీయకళాఖండము. అట్టి కళాఖండమును సృష్టించిన శిల్పా చార్యులు ఎంతేని ప్రశంసనీయులు.

తిరుమలనాయకుడు కావించిన దానధర్మములు, కట్టించిన గుళ్లు గోపురములు విస్మరించరానివి. అతని నిర్మాణములలో దుప

మండపము అద్భుతమైనది. అది 124 స్తంభముల కట్టడము. ప్రతి స్తంభము ఒక అపూర్వ కళాఖండము! మారియమ్మన్ తెప్పకుళము నకు ఒక్కని మెట్లు కట్టించెను. చైత్రో (చిత్తిరై) త్సవమును మహో త్సవముగా జరపసాగెను. తిరుమలనాయకుడు జరిపించిన ఉత్సవాదుల వలన మధురకు ఉత్సవముల నగరమను విఖ్యాతి లభించెను.

కళలును, సాహిత్యమును సాధారణముగా శాంతి భద్రతలు వర్ధిల్లు రాజ్యమునందే వర్ధిలగలవు. మధురనాయకరాజులు సంతత సమరములందు నిమగ్నులైయున్నను వారికి కల కళాభిరుచి మాత్రము అందువలన హ్రస్వము కాలేదు. ఇక మంగమ్మగారి వదాన్యత వర్ణ నాతీతము. నేటికిని తమిళనాడులోని మారుమూలల నున్న పల్లెపట్టు లందు కూడ ఆమె పేరు ప్రతిధ్వనించుట గమనింపదగు విషయము. ఆమె మత సహనమును గ్రహించుటకు ఈ క్రింది విషయము తోడ్పడగలదు.

రాజ్యక్షేమము దృష్ట్యా క్రైస్తవమతానుయాయులను నిర్బం ధించుట శ్రేయస్కర మని తంజావూరు పాలకుడు సలహా చెప్పగా, అందులకు మంగమ్మ యిటుల సమాధాన మొసగెనట. "కొందరు శాకాహారులు. మరికొందరు మాంసాహారులు. అటులనే తనకు ఉత్తమ మని తోచిన మతమును అవలంబించుటకు ప్రతి మానవునికి అధి కారము కలదు."

మధురనాయకరాజుల కాలములో బ్రాహ్మణులు విశేష గౌరవాభిమానములు పొందుచుండిరని విదిత మగుచున్నది. తెలుగు బ్రాహ్మణులు పలువురు మంత్రిత్వము నెరపుచుండిరి. అంతేకాక సైన్యాధ్యక్షులుగా కూడ వారు నియమితు లగుచుండిరి. అట్టివారిలో ప్రముఖుడు దళవాయి రామప్పయ్య. అటులనే దళవాయి నరసప్పయ్య

మొదలగువారు ఎంతో సమర్థతతో తమ విద్యుక్తధర్మములను నిర్వ హించిరి. దుష్టస్వభావుడగు దళవాయి వేంకటాచార్యుని వంటివారు కూడ అనాటి మంత్రులలో కొందరు లేకపోలేదు. మంత్రిమండలి సహాయముతో నాయకరాజులు రాజ్యవ్యవహారములు పరిశీలించు చుండిరి.

బ్రాహ్మణేతరులు కూడ మంత్రులుగా నియమింపబడుచుండిరి. అట్టివారిలో విశ్వనాథ నాయకునికి కుడిబుజముగా వ్యవహరించిన దళవాయి ప్రధాని అరియనాథ మొదలి స్మరణీయుడు. మధుర రాజ్యపు రూపరేఖలు దిద్దిన ప్రముఖులలో అతడొకడు. ఇంకను దళవాయి రంగన్ననాయడు, దళవాయి సముఖము వేంకట కృష్ణప్ప నాయడు మొదలగువారు కూడ పేర్కొనదగిన స్వామి భక్తులు. దళవాయికి తరువాత రాయసం కూడ రాజ్యవ్యవహారములలో ప్రముఖ పాత్ర వహించు చుండెను.

వర్ణాశ్రమ ధర్మసంరక్షకులుగా మధురనాయకరాజులు పేరు పెంపులు గడించినను వారు మహమ్మదీయ క్రైస్తవమతములను కూడ ఆదరించిరనుట మరచిపోరాని విషయము. ఇరుగుపొరుగుల నున్న రాజ్యములందు క్రైస్తవ మత ప్రచారకులు బాధావహు లగుచుండగా మధుర రాజ్యములో మాత్రము వారు బాహాటముగా మతప్రచారము కావించుకొనుచుండిరి. అట్లని మధురలో వారు బాధల ననుభవింప లేదని చెప్పలేము. కుమతులైన ప్రభుత్వోద్యోగులవలన వారు కూడ ఇతరులవలె ఇడుమలకు పాల్పడిరి. కాని వారు రాజానుగ్రహమునకు పాత్రులగుటచే మధుర రాజ్యములో క్రైస్తవము బహుళవ్యాప్తి నందెను. మంగమ్మ మహమ్మదీయులను ఆదరించుటయే కాక వారి మసీదులకు విరివిగా దానధర్మములు చేసినట్లు శాసనాధారమువలన

వ్యక్త మగుచున్నది. ఆమె సర్వవర్ణములవారి ధర్మములను సంరక్షించు చుండెను.

రాజకుటుంబములలో ఆ నాళ్ళలో సహగమనము ప్రబలాచారము గా ఉండెను. తంజావూరి విజయరాఘవరాయల మరణవార్తను విని రాచనగరున ఉన్న మహిళ లెల్లరు చితియందు దూకిరి. మధుర నేలిన తిరుమలనాయకుని మరణానంతరము అంతఃపురాంగనలు ఇన్నూరుమంది అతనితో సహగమన మాచరించిరి. అటులనే రామనాథపురము నేలు తిరుమల సేతుపతి విగతజీవుడైన పిమ్మట అతని నలుబదియేడుగురు భార్యలును చితి నెక్కిరి. అట్టియెడ ఒక్క మంగమ్మయే యీ ఆచారము నతిక్రమించెను. ఆమె సహగమనమును రూపుమాప దలచెనేమో! కాని దీనిని స్పష్టము చేయు అధారములు లేవు. ఈ ఆచారము సామాన్య ప్రజలలో కూడ ప్రబలియున్నట్లు తెలియవచ్చు చున్నది. కావున రాజులవరకే తదాచారము పరిమితమై యుండె ననుట పొసగదు. బహుకళత్ర గ్రహణమును, వేశ్యాంగనా గమనమును శ్రీగల భాగ్యశాలుర లక్షణములుగా ఉన్నట్లును విదిత మగు చున్నది.

నాయకరాజులనాటి రాజకీయ, సాంఘిక, మతవిషయములను తెలిసికొనుటకు జెసూయిట్ పాదిరీలు వ్రాసిన లేఖలు మిక్కిలిగా తోడ్పడుచున్నవి. వారు క్రీ. శ. 1592 లో మధురలో క్రైస్తవమత వ్యాపనోద్దేశముతో ఒక మిషనును స్థాపించిరి. దానికే మధుర మిషను అని పేరు. ఐరోపాలోని అధికారులకు మధుర తంజాపురాది రాజ్యములందలి మత విషయములను తెలియజేయు తలంపుతో పాదిరీలు లేఖలు వ్రాసినను, వాటిలో నాటి రాజకీయ సాంఘిక పరిస్థితులు కూడ పేర్కొనబడుటచే 17 వ శతాబ్దపు దక్షిణాపథ సాంఘిక

చరిత్రను తెలిసికొనుటకు వీలగుచున్నది. ఫ్రెంచి భాషలో ఉన్న యీ లేఖలను ఆంగ్లములోని కనువదించిన శ్రీ ఆర్. సత్యనాథయ్యరు ప్రశంసనీయులు.

ఆ దినములలో పోర్చుగీసువారి యెడల ప్రజలు ద్వేషభావము వహించియుండిరి. వారిని తెలుగువారు బుడతకీచులనియు, తమిళులు పరంగివా రనియు వ్యవహరించుచుండిరి. బుడతకీచులు నిమ్నజాతుల వారితో కలసిమెలసి సంచరించు చుండిరి. మద్యమాంసములను సేవించు చుండిరి. వారి ప్రవర్తనము మిక్కిలి అసభ్యముగా కనబడె నట. అందువలననే వారి సిరిసంపదలుగాని, ధైర్య స్థైర్యములుగాని నాటి ప్రజను ఆకర్షింపలేకపోయెను. పైపెచ్చు వారు తాత్త్విక విషయములను బోధించుటకు అనర్హులనియు ప్రజలు భావించిరి. బుడతకీచులమీది ద్వేషభావముచేత ప్రజలకు జెసూయిట్ పాదిరీ లన్నను ఆదరభావము కలుగలేదు. కాగా పాదిరీల కృషి చాలకాలము వరకు ఫలింపలేదు. రాబర్ట్ డి నొబిలి అను పాదిరీ రాకతో మధుర మిషను చరిత్రలో నూతనాధ్యాయము ప్రారంభ మయ్యెను. అతని కృషి ఫలితముగా పలువురు బ్రాహ్మణులు కూడ క్రైస్తవ మతమును స్వీకరించిరి.

1610 లో రాబర్ట్ డి నొబిలి వ్రాసిన ఒక లేఖ నుండి మధుర లోని విద్యావ్యవస్థకు సంబంధించిన యీ క్రింది విషయములు తెలియు చున్నవి.

మధురలో పదివేలమందికి పైబడి విద్యార్థు లుండిరి. ఒక్కొక్క తరగతిలోను ఇన్నూరు మున్నూరు మంది చదువుచుండిరి. విద్యార్థు లందరు బ్రాహ్మణులు. ఉన్నత విద్యాభ్యాస మొనర్చు అర్హత వారికే పరిమితము. విద్యార్థులదృష్టి యితర విషయములందు లగ్నము

కాకుండుటకై వారి అన్నపానాదులకుగాను విజయనగరాధీశ్వరులును, మధురనాయకరాజులును విరివిగా ధర్మకార్యము లొనర్చిరి. ఆ ధర్మకార్యములవలన లభించు ఆదాయము విద్యార్థుల తిండితీర్థములకును, అధ్యాపకుల జీతబత్తెములకును సరిపోవుచుండెడిది. ఉన్నత విద్యలో పలుభాగములు కలవు. వాటిలో తొలుతటిది తత్త్వశాస్త్రము. దానికి చింతామణి అని పేరు. అది ఐదేండ్ల చదువు. ఇంకను వేదాంతము మరికొన్ని భాగములు కూడ కలవు. మధురలో పలు కళాశాల లుండెననియు, వేదాంతశాస్త్రము ననేకులు అభ్యసించుచుండిరనియు, ఉన్నత విద్యాభ్యాసము సంస్కృతమునందే జరుగుచుండెననియు మరియొక పాదిరీ వ్రాసిన లేఖనుండి తెలియవచ్చుచున్నది.

ఉన్నత విద్యాభ్యాసము బ్రాహ్మణులకే పరిమితమైయుండినను, ఆ నాళ్ళలో బ్రాహ్మణేతరులలోను సంస్కృత పండితు లున్నట్లు పాదిరీల లేఖలనుండి స్పష్ట మగుచున్నది. మతవిషయిక చర్చలో ఒక కమ్మరి పాల్గొనెనట. పరయ డొకడు (పంచముడు) సంస్కృత విద్వాంసుడై యుండెనట. ఒక మహిళ సంస్కృతములో అనాయాసముగ సంభాషించు చుండెనట. ఆమెకు సుప్రసిద్ధ సంస్కృత కవుల శ్లోకములు జిహ్వాగ్రములై యుండెనట!

1609 లో రాబర్ట్ డి నొబిలి వ్రాసిన ఒక లేఖలో నాటి విద్యావ్యవస్థకు సంబంధించిన మరికొన్ని విషయములు పేర్కొనబడినవి.

శ్రుతి స్మృతులను వ్రాయుట దోషముగా గణింపబడుచుండెను. వాటిని కంఠతః నేర్పుచుండిరి. అందులకు పది పండ్రెండు సంవత్సరములు పట్టుచుండెను. ఒకవేళ ఎవరైనను వాటిని వ్రాయదలచిన, ఆ వ్రాయుట అతి రహస్యముగా జరుగవలెను. లేకున్నచో వ్రాసినవానిని శిక్షించుచుండిరి.

పాదిరీల లేఖలలో మధురయందలి ప్రజాజీవనమునకు సంబంధించిన పెక్కువిషయములు కూడ ఉదాహృతము లగుట గమనింపదగినది.

ఆ దినములలో శత్రువుల చేజిక్కుట అవమానకరమని మానధనులగు ప్రజలు భావించుచుండిరి. ముఖ్యముగా గ్రామములందలి ప్రజలు శత్రువుల బారినుండి బయటపడుటకు బలవన్మరణమునకు కూడ సంసిద్ధు లగుచుండిరి. కొందరు తొలుత తమ సతీసుతులను సంహరించి పిదప తమ్ము తాము చంపుకొనుచుండిరి. మరికొందరు తాము నివసించు గృహములకే నిప్పుపెట్టుకొని దుర్మరణము చెందుచుండిరి. అందులకు కారణము విజయగర్వమున వైరివీరు లొనర్చు పైశాచిక కృత్యములే అనదగును.

యుద్ధసమయములలో నాటిప్రజలు భయభ్రాంతులై సంచరించినట్లు తెలియవచ్చుచున్నను, ఆనాటి క్షత్రియులు మాత్రము మొక్కవోని ధైర్యసాహసములతో సంచరించుచుండిరి. వారు ఖడ్గములను, బల్లెములను ఉపయోగించుచుండిరి. ధనుస్సు, తుపాకి మొదలగువాటిని వారు విసర్జించిరి. పగరకు వెన్నిచ్చి పరుగిడుట నీచమని వారు తలచిరి. రణరంగమున గెలుపో చావో అంతేకాని శత్రువుల చేజిక్కి జీవించుటకు వారెన్నడును ప్రయత్నించి యుండలేదు. అట్టి జీవనముకంటె మరణమే శ్రేయస్కరమని వారి విశ్వాసము.

బ్రిట్టో అను పాదిరి 1683 వ సంవత్సరమున వ్రాసిన ఒక లేఖలో అభిజాత్యసంపన్నుడగు హిందువు రాజావలె నివసించునని పేర్కొనెను. అతడు మాంసమును ముట్టడు. మద్యమును ముట్టడు. మద్యపానము చేయువారిని ఆదరభావమున చూడడు. ప్రతిదినము వేకువజామున స్నానము చేయును. పాదిరీల లేఖలనుండి ఆనాటి స్త్రీలకు సంబంధించిన కొన్ని విషయములు కూడ తెలియుచున్నవి.

సచ్ఛీలము ఉత్తమ ధర్మముగా భావింపబడుచుండెను. కాని ఆనాటి సంఘమునందు - ముఖ్యముగ రాజులు, ఉన్నతోద్యోగులు, ధనికులు మున్నగువారిలో - సౌశీల్యము కొంచెము తగ్గుముఖము పట్టెనని నుడువవలసియున్నది. బహు భార్యాత్వము, వేశ్యాగమనము ఆనాటి వారికి పరిపాటిగా ఉండెను. అంతఃపురములందు రాజులు పలువురు స్త్రీల నుంచుకొనుచుండిరి. సామాన్యులకు కూడ ఉంపుడు గత్తె లుండిరట. సామాన్య స్త్రీలు రంగుచీరలు ధరించుచుండిరి

అంతఃపురాంగనలే కాక సామాన్య స్త్రీలు కూడ సహగమనము నాచరించుచున్నట్లు విదిత మగుచున్నది. జెసూయిట్ పాదిరీల లేఖలలో ఒకదానిలో ఈ క్రింది ఉదంతము ఉదాహరింపబడినది.

భర్త విగతజీవుడయిన పిదప, అతని భార్య సహగమనము నాచరించుటకు యత్నించెను. అప్పు డామె చూలాలు! గర్భమునందలి శిశువును సంరక్షించు తలపుతో ఆమె బంధువు లామెను సహగమనము నాచరింపవలదని శతవిధముల కోరిరి. కాని వారి మాటల నామె పెడచెవిని పెట్టెను. తుదకు ఊరి పెద్ద కూడ ఆమెను సమీపించి సహగమనము వలదని నుడివెను. ఆమెను పోషించు భారమును కూడ అతడు తనపై వేసికొనెను. అయినను లాభము హుళక్కియే అయ్యెను. ఆ యిల్లాలు సహగమనము నాచరించెను.

జెసూయిట్ పాదిరీల లేఖలను పరిశీలించినచో ఆనాళ్ళలో మతమునకు ప్రాధాన్యము కలదనియు, రాజులే కాక ప్రజలు కూడ తమతమ మతసంప్రదాయములను గౌరవించు చుండిరనియు విదిత మగుచున్నది. హైందవాచార వ్యవహారములను పరిహసించుపట్టులు కూడ వారి లేఖలలో లేకపోలేదు.

ఉపసంహారమున, నాయకరాజుల కాలములో మధురరాజ్యము సర్వవిధముల అభివృద్ధికి వచ్చె నని నుడువుటయే సమంజసము.

ఏలయన మధురనాయకరాజులకు పూర్వము పాండ్యమండలములో శాంతిభద్రత లున్నట్లును, వ్యవసాయ సదుపాయము లున్నట్లును తెలియవచ్చుటలేదు. దుర్గములు, గుడులు, గోపురములు మున్నగునవి శిథిలములై ఉండెను. వాటిని పునరుద్ధరించుటయే కాక నాయక రాజులు పాండ్యమండలమును సస్యశ్యామలముగాను, సుందరా రామముగాను, కమనీయ కళాఖండముగాను తీర్చిదిద్దిరి. దక్షిణా పథమున కానవచ్చుచున్న సత్రములు, చావడులు, ఆలయములు ననేకములు నాయకరాజుల కాలమున వెలసియుండుట పేర్కొనదగిన విషయము. సహజముగా దయార్ద్రహృదయులు, దైవభక్తులు నైన ఈ నాయకరాజులకాలములో ప్రజలు కొన్ని కారణములవలన బాధా వహులైనను, వారి దొరతనములో కొన్ని లోపములున్నను, మొత్తము మీద నాటి ప్రజాజీవనము సౌఖ్యప్రదముగా సాగినట్లు చెప్పవచ్చును.

# 15

# నాయకరాజుల కాలపు తెలుగు, తమిళ సాహిత్యములు

తంజావురాంధ్ర వాఙ్మయముతో పోల్చి చూచిన, మధురలో తెలుగసాహిత్యము అంతగా అభివృద్ధి చెందలేదనుట స్పష్టము. శిల్ప చిత్రలేఖనాది లలితకళలను పోషించిన ఆ తెలుగదొరల చూపు ఎందుకో తెలుగు సాహిత్యముపై అంతగా ప్రసరించలేదు. అయినను ఆనాళ్ళలో వెలుగు చూచిన తెలుగు రచనలలో విశిష్టత లేకపోలేదు.

విశ్వనాథనాయకుని స్థానాపతి వ్రాసిన రాయవాచకము మధురాపురాంధ్ర సాహిత్యమునకు శ్రీకారము చుట్టినది. వ్యావహారిక భాషలో సంతరించబడిన యీ వచన రచన చారిత్రకముగా విలువ కలది. రాయవాచకము తెలుగు వచన రచనకు నాంది పలికె ననుట పొల్లుమాట కానేరదు.

సత్యభామా సాంత్వన కృతికర్త అయిన లింగనమఖి శ్రీ కామేశ్వరకవి తిరుమలనాయకుని కాలములో వర్ధిల్లిన ప్రముఖ కవి. ఇది తరువాతి సాంత్వన రచనలకు మార్గదర్శకమయ్యె ననవచ్చును. ఇది నాలుగాశ్వాసముల శృంగార కావ్యము. శ్రీ కామేశ్వరకవి ధేనుమాహాత్మ్యమను వచన రచన కూడ చేసెను.

ముద్దళగిరి కూడ తెలుగు భాషాపోషకుడు. అతడు శ్రీ కామేశ్వర కవిని ఆదరించినాడు. ప్రసిద్ధ లాక్షణికుడు, బహుగ్రంథకర్తయు నైన గణపవరపు వేంకటకవిని కూడ ఆదరించినాడు. ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము, విద్యావతీ దండకము మున్నగునవి అతని రచనలు. వికటకవి గోపాలరాయకవి మధురమంగా పుంశ్చలీ లీలావిలాస మను వచన రచన కావించెను.

మధురనేలిన తెలుగురాజులలో కృతికర్తగా, కృతిభర్తగా కీర్తి చెందినవాడు విజయరంగ చొక్కనాథనాయకుడు. శ్రీరంగ మాహాత్మ్యము (10 అధ్యాయములు), మాఘమాహాత్మ్యము (15 అధ్యాయములు) అను వచన కావ్యములు అతని రచనలు. ప్రౌఢ గంభీరమైన శైలిలో సాగిన యీ రెండు రచనలు నేటికిని అముద్రితములై ఉండుట దురదృష్టము.

సముఖము వేంకట కృష్ణప్పనాయకుడు, శేషము వేంకటపతి, కుందుర్తి వేంకటాచలకవి, వెలగపూడి కృష్ణయామాత్యుడు, వెలిదండ్ల అళఘరికవి మున్నగు విద్వత్కవులను ఆదరించి, విజయరంగ చొక్కనాథుడు తన భాషాభిమానమును ప్రకటించుకొనెను.

వేంకటకృష్ణప్పనాయకుడు జైమిని భారతము, అహల్యాసంక్రందనము మొదలైన గద్య పద్య కృతులకు కర్త. శేషము వేంకటపతి వెలయించిన శశాంకవిజయము రసహృదయులను బహుధా ఆకర్షించిన అయిదాశ్వాసముల శృంగార కావ్యము ఇది వంగల సీనయ్యకు అంకిత మీయబడినది. సంగీత సాహిత్యములలో ప్రముఖుడైన సీనయ్య సరసగద్య పద్య రచనాభోజుడు! అతడు ప్రసిద్ధ పద కర్త. చతుర్విధ కవితాలోలుడైన కుందుర్తి వేంకటాచలకవి సంతరించిన కృతులు చాల కలవు. వాటిలో యక్షగానములు కూడ కలవు.

వెలగపూడి కృష్ణయామాత్యుడు, శ్యామరాయకవి మున్నగువారు గద్య పద్య కావ్యములు రచించి తెలుగు సాహిత్యమును పరిపుష్టము చేసిరి.

మధురనాయకరాజుల కాలములో వెలుగు చూచిన తెలుగు కృతులు రాశిలో తక్కువే అయినను వాసిలో గొప్పవి. వచన వాఙ్మయము రూపరేఖలు సంతరించుకొన్న కాల మది. పద్యకృతు లైన ప్రముఖ రచనలకు వచనానువాదములు వెలసిన కాల మది. వ్యావహారిక భాష శిష్టుల రచనలలో ప్రవేశించిన కాల మది. సాంత్వన రచనలు, యక్షగానములు వాడుకలోకి వచ్చిన కాల మది.

ఇంతవరకు నాయకరాజుల కాలపు తెలుగుసాహిత్యపు తీరు తెన్నులను దిఙ్మాత్రముగ పరిశీలించినాము. ఇక ఆ కాలపు తమిళ సాహిత్యమును దర్శింతము.

తమిళ నాడులో ప్రభుత సాగించినను, మధురనాయకరాజులు తమిళభాషా సాహిత్యములను ఆదరించవలసినంతగా ఆదరించ లేదనుట సత్య సన్నిహితము. అతివీరరామ పాండ్యన్, కుమర గురుపర్, పిళ్లై పెరుమాళ్ అయ్యంగార్, సుప్రదీప కవిరాయర్, ఉమరు పండితుడు, తాయుమానవర్, త్రికూటరాశప్ప కవిరాయర్ ప్రభృతులు ఆ నాళ్లలో వర్ధిల్లిన కొందరు తమిళ కవులు.

కుమరగురుపర్ తిరుమలనాయకుని కాలములో వర్ధిల్లిన ప్రసిద్ధ కవి. అయన రచించిన మీనాక్షియమ్మై పిళ్లైత్తమిళ్ అను కావ్యము తిరుమలనాయకుని సమక్షమున అవిష్కృత మయ్యెను. 'మీనాక్షియమ్మన్ కురం' కావ్యాంతమున అయన తిరుమలనాయకుని ఇటుల ప్రశంసించెను.

"సీర్‌వాళి, తెన్‌మదురై నిన్మలర్ అరుళ్‌వాళి, కార్‌వాళి, అంగయర్‌కణ్ కన్నిత్తిరుమరుళ్‌వాళి, సీర్‌వాళి, కూడల్‌నగర్

త్రిరుమలై భూపతివాళి, పేర్ వాళి, అవన్‌చెల్వం పెరితూళి వాళియవే."

తిరుమలనాయకుని కోరికను పురస్కరించుకొని ఆయన, తమిళ వేదమని పేరుపెంపులు గడించిన తిరుక్కురళ్‌లోని నీతులను వివరించుచు నీతినెరి విళక్కం అను లఘురచన కూడ చేసెను.

తిరుమలనాయకుని కాలములోని వాడగు సుప్రదీప కవిరాయర్ తిరుమలైనాయక్కర్ కాదల్ అను కావ్యము వ్రాసి దానిని తిరుమల నాయకుని సభాభవనమున చదువగా, కావ్యగత సౌందర్యమును తెలిసికొనలేని రాజు 'అరవం అధ్వాన్నం' అని పరిహసించెనట! అటు పిమ్మట కవి కూళప్పనాయక్కన్ కాదల్ అని కావ్యమును మార్చి దానిని కూళప్పనాయకుడను ఒక సామంతరాజునకు సమర్పించి అతని వలన బహుమతుల పొందెను. అప్పటికిని కోపము చల్లారని ఆ కవి తన వేరొక రచనలో 'తొన్ది వడుగన్' (బొజ్జకల తెలుగువాడు) అని తిరుమలనాయకుని పేరు చెప్పక అతనిని పరిహసించెను. తిరుమల నాయకునికి బొజ్జ కలదు. ఈ సుప్రదీప కవిరాయర్ వీరమామునివర్ అను నామాంతరముకల బెస్చి పాదిరీకి తమిళము నేర్పిన గురువని చెప్పుదురు.

ఒక తమిళ కవిని ఆదరించి, ఆయనకు భూదానము చేసిన ఘనత విజయరంగ చొక్కనాథ నాయనిం వారికి చెందుచున్నది. తిరుక్కుట్రాల కుర్రవంజి అను రచన చేసిన త్రికూట రాశప్ప కవి రాయర్ విజయరంగ చొక్కనాథుని ఆదరమును చూరగొనుటయేకాక కుట్రాలం ప్రాంతమున కొంత భూమిని కూడ సంపాదింపగలిగెననియు ఒక శాసనమువలన తెలియుచున్నది. ఈ కురవంజి గానానుకూలమైన రచన అని వేరుగా చెప్ప నవసరము లేదు.

# అనుబంధము

[మధురనేలిన నాయక రాజులకు సంబంధించిన చారిత్రక లేఖనములు తెలుగు, తమిళములందు చాల కలవు. వీటిలో 'మదురై త్తలవరలారు' అను తమిళలేఖనము ముఖ్యమయినది. దీనిలో మధురను పాలించిన రాజులెల్లరు పేర్కొనబడిరి. ఎప్పుడు వారు రాజ్యమునకు వచ్చిరో, ఎంతకాలము వారు పాలించిరో, వారు చేసిన దానధర్మము లెట్టివో—మున్నగు విషయములు కూడ ఉదాహరింపబడినవి. కాని ఆధునిక చరిత్రకారుల పరిశోధనల వలన బయల్పడిన అంశములను పురస్కరించుకొని చూచిన ఈ లేఖనములో పేర్కొనబడిన తేదీలు కొన్ని సరి కావని నుడువవలసియున్నది. అయినను కాలనిర్ణయము చేయు నవసరమున ఈ లేఖనములవలన కొంతయైన లాభము కలుగు ననుట సమంజసము!

తొలుదొలుత మదురై త్తలవరలారును పరిష్కరించినవారు కీ. శే. ము. రాఘవయ్యంగారు. వీరు భాషా కవిశేఖర బిరుదాంకితులు. తమిళమున గొప్ప పండితులు; విమర్శకులును. వారే దీనిని 'సెందమిళ్' అను పత్రికలో ప్రచురించిరి. మదురై త్తలవరలారులో మధురనాయకరాజులను గూర్చి పేర్కొనబడిన అంశములను మాత్రము ప్రస్తుతము యథాతథముగా ఉదాహరించుచున్నాను.]

"శకాబ్దం 1481 మీద చెల్లు రౌద్రి సంవత్సరం మార్గళి నెల రాయలవారి ఉత్తరువు ననుసరించి కోట్యం నాగమనాయకుని కుమారుడు విశ్వనాథ నాయనయ్య మధురకు వచ్చి రౌద్రి సంవత్సరం

మార్గళినెల మొదలు అంగీరస సంవత్సరం వైగాసి నెల వరకు 12 సం॥లు రాజ్యం చేసి అస్తమించిరి. పిమ్మట అంగీరస సం॥ ఆణినెల మొదలు వృష సంవత్సరం వైగాసి నెల వరకు 9 సం॥లు విశ్వనాథ నాయనయ్య కుమారుడు కృష్ణప్ప నాయనయ్య రాజ్యం పాలించి అస్త మించిరి. వృష సం॥ ఆణినెల మొదలు మన్మథ సంవత్సరం వైగాసి నెలవరకు 14 సం॥లు కృష్ణప్ప నాయనయ్య కుమారుడు వీరప్ప నాయనయ్య రాజ్యం చేసి స్వర్గస్థులయిరి. పిమ్మట మన్మథ సం॥ మొదలు శుభకృతు సంవత్సరం ఆణినెల వరకు 7 సం॥లు వీరప్ప నాయనయ్య కుమారుడు కుమారకృష్ణప్ప నాయనయ్య రాజ్యంపాలించి అస్తమించిరి. శుభకృతు సం॥ పెరట్టాసినెల మొదలు ప్లవంగ సంవత్సరం మాసినెల 5 సం॥లు కుమార కృష్ణప్పనాయనయ్య తమ్ముడు విశ్వప్ప నాయనయ్య రాజ్యం చేసి స్వర్గం అలంకరించిరి. ఆయన తమ్ముడు కుమార రంగప్ప నాయనయ్య పట్టానికి వచ్చి నాటిక్ (నదీ) తీరముననున్న సంధ్యామండపములో ఎనిమిదవ రోజున అస్త మించిరి. పిమ్మట విశ్వప్ప నాయనయ్య కుమారుడు ముద్దుకృష్ణప్ప నాయనయ్యయూ, ఆయన కుమారుడు ముద్దువీరప్ప నాయనయ్యయూ పట్టం కట్టుకొని ప్లవంగ సం॥ పంగుణినెల మొదలు దుందుభి సం॥ కార్తీకమాసం వరకు 15 సం॥లు రాజ్యంచేసి స్వర్గస్థులయిరి. దుందుభి సం॥ మార్గళినెల 7 వ తేదీ ముద్దువీరప్ప నాయనయ్య వారి తమ్ముడు ముద్దుతిరుమలనాయనయ్యవారు పట్టం గట్టుకొని శ్రీ మీనాక్షి సుందరే శ్వరుల కటాక్షానికి పాత్రులై, స్వామివారికి అనేక ఆభరణాలు చేయించియిచ్చి, పుదు (కొత్త) మండపం, తెప్పకుళములు కట్టించియు, స్వామిసన్నిధిలో బంగారుపూతవేసిన సింహాసనము, దంతంతో చేయ బడిన చవుకమును, రత్నసింహాసనమును చేయించి యిచ్చి, ఏడు గుళ్ళకు అనేకంగా సత్కార్యాలు చేసి నిత్యపూజకుగాను నలభైనాలుగు

వేల పణములు (ఆదాయం లభించు) సీమను ఇచ్చి గుడికి సంబంధించిన పరిజనులకు అన్నపానాదికములకుగాను సర్వమాన్య అగ్రహారములు యిచ్చి, తమ సొంతంలో గృహనిర్మాణమున్ను చేసి, ఉత్సవాదులను వైభవంగా జరిపించి స్వామి అళగర్‌వారికి చిత్తిరై ఉత్సవానికి చప్పరము కట్టించి స్థలము లన్నిటిని మిగుల ప్రబలంగా చేసి, 'స్వామి దర్శనానికి వస్తే స్వామికి పాదకానుక అభిషేక నైవేద్యాలకు వెయ్యి పణములు యిచ్చేది: మాడివీధిలో వేంచేసియున్నప్పుడు స్వామివారికి వెయ్యిపణములు యిచ్చేది;' ఈ విధంగా దుందుభి సం॥ మాసినెల 7 వ తేది మొదలు విళంబి సం॥ మాసినెల 4 వ తేదీవరకు 36 సం॥లు రాజ్యం పాలించి విళంబి సం॥ మాసి నెల 4 వ తేదీ మంగళవారం రాత్రి దైవికం చెందిరి. విళంబి సం॥ పంగుణినెల మొదలు వికారి సం॥ వైగాసినెల వరకు 3 సం॥లు ఆయన కుమారుడు ముద్దువీరప్ప నాయనయ్య రాజ్యం పాలించిరి. వికారి సం॥ ఆణినెల మొదలు దుందుభి సం॥ ఆణినెల వరకు 24 సం॥లు ముద్దువీరప్ప నాయనయ్యవారి కుమారుడు చొక్కనాథనాయనయ్య రాజ్యం చేసి ఆణినెల 4 వ తేదీ స్వర్గస్థు లయిరి. ఆయన కుమారుడు రంగకృష్ణ ముద్దువీరప్ప నాయనయ్య రుధిరోద్గారి సం॥ ఐప్పసినెల 17 వ తేదీ మొదలు ప్రమోదూత సం॥ వరకు 7 సం॥లు రాజ్యం చేసి స్వర్గస్థులయిరి. పిమ్మట ఆయన కుమారుడు విజయరంగ ముద్దుచొక్కనాథ నాయనయ్య పసిబిడ్డగా ఉన్నందువల్ల ఆయన అవ్వయైన మంగమ్మగారా బిడ్డను ఒడిలో కూర్చుండబెట్టుకొని కొద్దిరోజులు రాజ్యం పాలించినారు. అప్పుడు చాలా అగ్రహార ప్రతిష్ఠలు, సత్రములు, శాలలు నిర్మించి, తిరుమలనాయనయ్య వారి రోజులలో జరిగిన ఒప్పందం ప్రకారం దేవాలయ విషయములను జరిపించుతూ వచ్చిరి. మంగమ్మగారు స్వర్గస్థులయిన పిమ్మట విజయరంగ ముద్దుచొక్కనాథ నాయనయ్య రాజ్యం పాలించుతూ పూర్వం

తిరుమలనాయనయ్యవారి రోజులలో జరిగిన విధంగా జరిపించుతూ వచ్చిరి. ఆ విధముగా జరిగే రోజుల్లో ఒకనాడు నగరశోధనకుగాను ఒంటరిగా గుడికి వచ్చి చూచిన సందర్భమున గుడిలో పూజ, దీపధూప నైవేద్యాలు పూజ్యంగా జరిగిన వైనం చూచి వారు అంతఃపురం పోయి చేరిరి. మరునాటి ఉదయం గుడికి సంబంధించిన పరిజను లందరినీ రప్పించి మనం గుడికిగాను సర్వసామాన్యముగా నలభైనాలుగువేల పణముల సీమను విడిచిపుచ్చగా ఈవిధంగా దైవకార్యంలో లోపం ఎందుకువచ్చింది—అని చాలాకోపం చేసుకొని పరిజనముల యధీనంలో వున్న గ్రామాలను సర్కారులో చేర్చి వారి గ్రామాలలో వుంచబడిన భూమిపట్టాలను తీసుకొని పరిహరించివేసి వీరుగుళ్ళ పూజకు నలభైనాల్గు వేల పణములున్నూ, అంతఃపురం బొక్కసంలోనుంచి నిత్యపూజను, ప్రత్యేకపూజలు అలంకార విశేషము, ఉత్సవాదులను, అళగర్‌స్వామి వారి చైత్రోత్సవమును (చిత్తి) విమర్శగా జరిపించుచు పరిజనములకు గుడికి పూర్వం తిరుమలనాయనయ్యవారి రోజులలో నడిచిన విధంగా నిర్వాహక గ్రామము (భటవృత్తి మాన్యము) అర్చనాగ్రామములను సర్వమాన్యంగా విడిచివేసి బహువిమర్శగా నడుపుతూ వచ్చిరి. వారు 40 సం॥లు రాజ్యం పాలించి విరోధికృతు సం॥ మాసినెల శివరాత్రి రోజున దైవికం చెందిరి. విరోధికృతు సం॥ మాసినెల మొదలు సిద్ధార్థ సం॥ వైగాసినెలవరకు 9 సం॥ములు విజయరంగ చొక్కనాథ నాయనయ్య భార్య మీనాక్షమ్మ పట్టంగట్టుకొని సోదరుడైన వెంకట పెరుమాళ్ నాయకుని సహాయంతో రాజ్యం చేసిరి.”

# ముఖ్యనామ సూచిక

---

## కొన్ని ఉపయుక్త గ్రంథములు

**తెలుగు**

దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము (1960) - శ్రీ నిడుదవోలు వేంకటరావు

వ్యాసమంజూష (1960) - చల్లా రాధాకృష్ణశర్మ

**తమిళము**

మదురై నాయక్కర్ వరలాఱు (1960) - శ్రీ అ. కి. పరందామనార్

**ఆంగ్లము**

History of the Nayaks of Madura - Prof. R. Sathianathaier

Tamilaham in the 17th Century - Prof. R. Sathianathaier